# భారతీయ లౌకిక వాదం
# నూతన పోకడలు

ఆచార్య కె. యస్. చలం



**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

# భారతీయ లౌకికవాదం
# నూతన పోకడలు

ఆచార్య కె. యస్. చలం




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**Bharateeya Lowkika Vaadham - Nuuthana Pookadalu**
by Prof. **K.S. Chalam**

రాజకీయ/ సామాజిక/ అర్థికశాస్త్ర గ్రంథాలు
ప్రచురణ నెం : 25
ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2005.



**వెల : 10-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.
E-mail : visalaandhraph@yahoo.com

**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్, సుల్తాన్ బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, అనంతపురం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.



ముద్రణ: **విశాలాంధ్ర ప్రెస్**, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

# ముందుమాట

దేశంలో గత పది పన్నెండేళ్ళుగా అమలులో వున్న ఆర్థిక విధానాలు దేశ సామాజిక, సాంస్కృతిక జీవితాన్ని చాలా ప్రభావితం చేశాయి. ఆర్థిక ప్రభావాలను ఆకళింపు చేసుకున్నంతగా, సామాజిక విషయాలను అర్థం చేసుకోవటం అంత తేలిక కాదు. ఆర్థిక ప్రభావాలు ప్రత్యక్షంగా, వెంటనే ప్రజల జీవితాల్లో కనిపిస్తాయి. సామాజిక, సాంస్కృతిక విషయాలు నెమ్మదిగా ప్రభావం చూపిస్తాయి. పునాది, ఉపరితల సమస్యల చర్చల్లో అవి గతంలో దోబూచులాడినా, యిటీవల కాలంలో వాటి విషయమై పెద్దగా పట్టించు కున్నవారే లేరు. ఆర్థిక విషయాల గూర్చి కూడా పెద్దగా బహిరంగ చర్చ జరగలేదనే చెప్పాలి. కారణం, అధికారంలో వున్న రాజకీయ పార్టీ ఏదైనా ఆర్థిక విషయాల్లో అందరికి ఏకీభావం వుంది. గాని సామాజిక, సాంస్కృతిక విషయాల్లో చాలా ఘర్షణలున్నాయి. లౌకిక ప్రజాస్వామ్య విలువలపై చాలా వక్రీకరణలు జరిగాయి. జరిగిన యీ మార్పుల విషయమై మేధావి వర్గం అంతగా స్పందించలేదు. భారత దేశ మౌలిక పునాదులైన లౌకిక, ప్రజాస్వామ్య, సామ్యవాద ఆలోచనా ధోరణులలో వచ్చిన మార్పును ప్రత్యేకంగా పేర్కొనాలి. ఈ మార్పులన్నీ 1991 తరువాత రావటం, దాని ఆధారంగానే గతంలో NDA ప్రభుత్వం అధికారం చేపట్టటానికి మార్గం సుగమం అయింది. ప్రపంచవ్యాప్తంగా అందరూ అంగీకరించిన కొన్ని విలువలను యీ కాలంలో వక్రీకరించటం జరిగింది. చరిత్ర, సంస్కృతి, భారతీయ సామాజిక జీవితంలో ప్రధానమైన కుల వ్యవస్థ, లౌకిక విధానంపై యీ వక్రీకరణల ప్రభావం వుంది. ఈ సమస్యలపై గత ఒకటి రెండు సంవత్సరాలుగా నేను విశాలాంధ్ర, వార్త వంటి దినపత్రికల్లో రాసిన వ్యాసాలపై చర్చ జరిగింది. వాటిలో కొన్నింటిని సేకరించి ఒక పుస్తకరూపంలో మిత్రుల కోరికపై యిప్పుడు ప్రచురిస్తున్నాము.

ఈ సంకలనాన్ని ప్రోత్సహించిన అభ్యుదయ రచయితల సంఘం వారికి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ రాజేశ్వరరావు గారికి ధన్యవాదాలు.

**ఆచార్య కె.యస్. చలం**
ఆంధ్రా యూనివర్సిటి,
విశాఖపట్టణం.

పేజి నెం.


1. ముందుమాట iii

2. భారతీయ లౌకికవాదం – నూతన పోకడలు 1

3. మూలవాసుల సంస్కృతిపై వేటు
'భారతీయత'కు చేటు 7

4. భారతదేశంలో విదేశీయులెవరు? 12

5. కులం కూడా ఒక సామాజిక పెట్టుబడే! 18

6. రిజర్వేషన్లు అడుక్కుంటే ఇస్తారా? 27

7. ఈ శతాబ్దపు మొదటి ఎన్నికలు దళిత ప్రస్తావన లేకుండా! 32

8. ఇఫ్తార్ విందుల్లో దళితులకు ప్రవేశం ఉందా? 37

9. హిందూ సాంప్రదాయంలో కోయిలకన్న
'ముఖ్య'మైన నెమలి 41

10. మాయావతి హిడంబి వారసురాలు 45

11. ఒకే దేవుడు, ఒకే మతం, ఒకే నది కావాలా! 49




# భారతీయ లౌకికవాదం నూతన పోకడలు

మన పార్లమెంటులో బాలయోగిని స్పీకర్‌గా ఎన్నుకొని మాయావతిని అవమానపరచిన 1998 నాటి సంఘటన రాజకీయ నాయకుల లౌక్యాన్ని ప్రజలముందుకు తెచ్చింది. ఇప్పుడెవరూ లౌకికవాదం గురించి మాట్లాడక పోవటం వింతగా లేదు. ఎందుకంటే అన్ని రాజకీయ పార్టీలూ లౌక్యానికి - లౌకికవాదానికి మధ్యగల వ్యత్యాసాన్ని తోసిరాజన్నాయి. మొదటి నుండి కూడా ఈ దేశంలో లౌకిక వాదం గురించి మాట్లాడిన రాజకీయ పార్టీలన్నీ లౌక్యాన్ని ప్రదర్శిస్తూ అసలు లౌకికవాదం మూల అంశాలను ప్రజలముందు ఎప్పుడూ చర్చించలేదు. కారణం - అన్ని రాజకీయ పార్టీలు లౌకికవాదం మూలంగా వచ్చే లాభం (ఓట్ల రూపంలో) నష్టం ప్రతి ఎన్నికలోనూ అంచనా వేసుకుంటూ ముందుకుపోతూ వున్నాయి. ప్రతి దేశంలోనూ లౌకికవాదం నిర్వచనం, అర్థం మార్చుకుంటూ, తమ ఆలోచనలకు, ఎత్తుగడలకు అనుకూలంగా దాన్ని రూపొందించుకుంటూ వస్తున్నారు. సిపిఐ లాంటి కొన్ని రాజకీయపార్టీలు లౌకికవాదంపై కొంత కృషిచేసి తమ మేధావి వర్గం ద్వారా కొంత సాహిత్యాన్ని రూపొందించినా ఆచరణలో అవి ఎంత వరకు ఉపయోగ పడ్డాయో ఇంకా అంచనా వేయవలసి వుంది.

అసలు లౌకికవాదం అంటే ఏమిటి? ఈ ఆలోచన భారతీయ సామాజిక జీవిత ఆచరణలో అనుకున్నంతగా వున్నప్పటికీ దీని తాలూకు వివరణ మాత్రం యూరోపియన్ దేశాల ప్రభావం మూలంగా ఇంగ్లీషు చదువులతో మనకు అబ్బింది అనుకోవచ్చు. లౌకికవాదం అంటే ఇహలోకానికి, ఈ జీవితానికి సంబంధించిన అంశం. సేక్రెడ్ అన్న పదానికి వ్యతిరేకమైనది. చర్చి అధికారం లేనిది. మతం తాలూకా నీడలు లేని ప్రభుత్వ యంత్రాంగం మనిషి తన జీవితానికి సంబంధించిన నమ్మకాలను మత ఆలోచనలు వైయక్తిక జీవితంలో ఆచరించాలే తప్ప బహిరంగంగా ప్రభుత్వాలద్వారా అమలు చేయటానికి వీలులేనిది. ఇటువంటి ఆలోచనకు రావటానికి యూరోపియన్ దేశాలకు కొన్ని

వందల సంవత్సరాలు పట్టింది. క్రూసేడ్ యుద్ధాల మానవ హరణం తరువాత మతయుద్ధాల్లో రక్తం ఏరులై పారిన తరువాత ఆ దేశాలు అనుభవంతో గ్రహించిన ఆచరణ యోగ్యమైన ఒక గొప్ప మానవ విలువ – లౌకికవాదం. ఈ వాదంలో ప్రజాస్వామ్యయుతమైన విలువలు, వ్యక్తి ఆలోచనలకు అతని అంతరంగ వ్యవహారాల్లో ప్రభుత్వం జోక్యం కలుగజేసుకోవటానికి వీలులేని ఒక ఉన్నతమైన మానవ విలువగా ఈ శతాబ్దపు Contribution గా చెప్పుకోవచ్చు. మరి భారతదేశంలో ఈ ఆలోచన ఇటీవలే వచ్చిందా? ఎంతో కాలంగా వస్తూ వున్నదా అన్నది ప్రశ్న. బ్రిటీష్ వారితో పోరాటం చేస్తున్న రోజుల్లో ఈ దేశ గొప్పతనాన్ని చాటటానికి యూరోపియన్ వారికంటే గొప్ప సంస్కృతి ప్రజాస్వామ్య విలువలు మాకూ వున్నాయని చాటడానికి ప్రయత్నించిన జాతీయ చరిత్రకారులు కొంత చరిత్రను వండారు. దానిలో మన దేశ చరిత్ర యావత్తూ లౌకికవాదంతో ముడిపెట్టబడి ఉందని, మనలను పరిపాలించిన రాజులంతా 'మతసామరస్యాన్ని' పాటించారని, అన్ని మతాలను సమానంగా ఆదరించి లౌకికవాదాన్ని పెంచి పోషించారని చెప్పటానికి ప్రయాస పడ్డారు. ఇందులో ఎంత నిజమో ఎంత కల్పనో యిప్పుడు అప్రస్తుతమైనా లౌకికవాదానికి వారిచ్చిన అర్థం అన్ని మతాలను సమానంగా చూడటం అన్నది అసలు గందరగోళం యిక్కడే ప్రారంభమయింది. ఈ గందరగోళాన్ని కాస్తముందుకు తీసుకుపోయి రాజ్యాన్ని యీ మూసలో వివరించటం ద్వారా మన జాతీయ నాయకులు మొత్తం సమస్యని జటిలం చేశారు. మన జాతీయ వేదాంతి డా. రాధాకృష్ణన్ (ఈయన్ని తత్వవేత్తగాకంటే వేదాంతిగానే చాలా మంది పరిగణిస్తున్నారు) లౌకిక వాదమంటే సర్వ ధర్మ సమభావన అని చెప్పారు. ఈ ఆలోచనను మొదట్లో ఎవరూ తీవ్రంగా గుర్తించకపోయినప్పటికీ తరువాత కాలంలో అందరూ దీన్ని సమర్థిస్తూ వచ్చారు. జవహర్‌లాల్‌నెహ్రూ మాత్రం లౌకికవాద నిర్వచనానికి కట్టుబడి చాలావరకు తన రాజకీయ జీవితంలో ఎప్పుడూ ఎక్కడా మతప్రస్తావనగానీ, మత ఆలోచనలనుగాని తీసుకురాకుండా ఒక ఆదర్శ లౌకికవాదిగా బతకటానికి ప్రయత్నించారు. మిగతా రాజకీయ నాయకులు చాలామంది హిందువులైతే ముస్లింల గురించి మాట్లాడి, ముస్లింలు అయితే హిందువుల సోదర భావం గూర్చి వల్లిస్తూ లౌక్యాన్ని ప్రదర్శించారే తప్ప ఎవరూ లౌకికవాదాన్ని తూచ తప్పక ఆచరించలేదు. నిజానికి రాజ్యాంగం రూపొందించిన మొదటి దినాల్లో మత సంఘర్షణలు, నమ్మకాల మధ్య పోటీ ఏర్పడి భారతీయతకు, భిన్నత్వానికి ప్రమాదం ఏర్పడిన తరువాత సెక్యూలరిజమ్ మాట

రాజ్యాంగంలో చేర్చటానికి కృషిచేశారే తప్ప, ఆ మాటను దాని అర్థాన్ని ప్రజా బాహుళ్యంలో ప్రచారం చేయటానికి ఎవరూ ప్రయత్నించలేదు. పైగా దానికి వక్రభాష్యాలు చెప్పి, రాజకీయ ప్రయోజనాలను అంటే ఓట్లను దండుకోవటానికి దుర్వినియోగం చేసినవారే ఎక్కువ. అందుకే లౌకికవాదం 'సర్వధర్మ సమభావం' నుండి యిప్పుడు 'సకల కుల సమభావం' వరకూ వచ్చింది. సర్వ ధర్మ సమభావం లౌకికవాదం ఎలా అవుతుంది. అప్పుడు మతానికి అర్థం ఏముంటుంది? మతం వేరేగా తయారౌతుంది. దీన్ని గ్రహించలేనివారు తమ ఆచారాలను, ఆలోచనలను త్యాగం చేయలేని కుత్సితులు లౌకికవాదానికి వక్రభాష్యాలు చెప్పి దేశంలో సంఘర్షణలను పెంచారు.

హిందూ ధర్మాన్ని బోధించే స్వాములు, అయ్యవార్లు, ముల్లాలు, పీఠాధిపతులు తమకు తోచినది చెప్పారు. తమ మతాన్ని ప్రచారం చేసుకోవడానికి దానిద్వారా సుఖమయ జీవితాన్ని అనుభవించటానికి ప్రయత్నించిన పెద్దలే ఎక్కువమంది వున్నారుగాని, ధర్మాన్ని, దేశ కాలపరిస్థితులకు అనుగుణంగా తీర్చిదిద్దినవారు చాలా అరుదు. వారికి దూరాలోచనలు లేవు. అందుకే దేశం మత సంఘర్షణల మారణహోమంగా మారుతూ వచ్చింది.

మతం మనిషి జీవితాన్ని తీర్చిదిద్దటానికి, మానవుని ఐహిక, ఆముష్మిక ఆలోచనలను ప్రభావితం చేసేదే అయితే అన్ని మతాలు చేప్పేది ఒకటిగానే ఉండాలి. ఆ మతం పుట్టిన దేశం, నైసర్గిక స్వరూపం, అక్కడి వనరులు, ఆ దేశ ప్రజల ఆచార వ్యవహారాల మూలంగా భిన్నత్వం వుంటుందే తప్ప ఏ మతమూ యింకో మతాన్ని, ఆ మతాన్ని ఆచరించే వాళ్లను యీసడించదు. అలా చేస్తే అది మతంకాదు. అది ఒక ఆలోచన మాత్రమే అవుతుంది. ఏ మతంలోనైనా ధర్మ, అర్థ, కామ మోక్షాల గూర్చి ఒకేలా చర్చ వుంటుంది. పాపం, పుణ్యం, దయ, జాలి, ఆశ వంటివి ఒకేలా నిర్వచించబడి వుంటాయి. భగవంతునికి, భక్తునికి మధ్య వుండే సంబంధాన్ని ఒక సున్నితమైన, సమున్నతమైన బంధంగా చెప్పబడి వుంటుంది. అది వారిరువురికి లేక ఒక్కరికి సంబంధించిన వ్యవహారం మాత్రమే. సమాజానికి తమ చుట్టూ వున్న ప్రజలకు సంబంధించింది కాదు. ఆ సంబంధం ద్వారా ముక్తి, లేక విముక్తిని పొందేది వ్యక్తి మాత్రమే. చివరకు తన తోటివారికి కూడా కొన్ని మతాల్లో విముక్తిని ప్రసాదించే ఆస్కారం లేదు. అటువంటి దాన్ని ప్రవక్తలు, మతవాదులు, రాజులు, రాజకీయ నాయకులు తమ అవసరాల కనుగుణంగా, మనిషిలో వుండే యీ

ప్రత్యేకతను తమ కనుగుణంగా మార్చుకుంటూ మతాల మధ్య, దేవుళ్ల మధ్య పోటీ పెట్టి తమ పబ్బం గడుపుకుంటు వచ్చారు. దానిద్వారా వాళ్లు లాభపడినా మతం గందరగోళంలోకి నెట్టబడింది. ఏ మతమైతే రాజ్యంతో అధికారంతో దూరంగా వుందో ఆ మతం, ఆయాకాలాల్లో ఆరోగ్యంగా వుంది. అలా లేకుండా అధికారంలో భాగం పంచుకున్నప్పుడు అది అధః పాతాళానికి వెళ్లింది. అందుచేత మతాన్ని రాజ్యం నుండి దూరంగా వుంచాలని తెలివైన వాళ్ళు ప్రజాస్వామ్య వాదులు నిర్ణయించారు.

ఇది ఇటీవల చరిత్రలో మనం నేర్చుకున్న గుణపాఠం అయినా, భారతదేశానికి వచ్చేసరికి ఇక్కడ వున్న 'భిన్నత్వం' లౌకికవాదానికి అవసరమైన పరిస్థితులు కల్పించింది. ప్రపంచంలో ఏ దేశంలో లేని ప్రత్యేకతలు, భిన్నత్వం ఇక్కడ వుంది కాబట్టే భారతీయుని నమ్మకాలను, ఆలోచనలను, ఏ ఒక్క మతంతోనో ముడిపెట్టి 'ఏకత' వైపు నెట్టి ఏకత్వాన్ని సాధించాలంటే భారతీయతను అవమానపరిచినట్లే. భారతీయ ఔన్నత్యాన్ని కించపరిచినట్టే అవుతుంది. ప్రపంచంలో అతికొద్ది దేశాల్లో మాత్రమే తమకు తోచిన మతాన్ని, నమ్మకాన్ని అవలంభించే అవకాశం వుంది. భారతదేశంలో అది యీనాడు వచ్చింది కాదు. వేల సంవత్సరాలుగా యీ సంస్కృతిలో ఒక భాగంగావుంటూ వస్తోంది. ఇక్కడ విభిన్న జాతులకు చెందిన ప్రజలు, తమకు నచ్చిన నమ్మకాలను, దేవుళ్లను, భాషను, ఆచారాలను పాటిస్తూ వస్తున్నారు. ఈ దేశానికి వైదికమతం వచ్చేనాటికే యిక్కడ ప్రజలు అనేకరకాల నమ్మకాలను, దేవుళ్లను కొలుస్తూ వచ్చారు. ఒక ప్రజాస్వామ్యయుతమైన వాతావరణంతో తాను దేన్నయితే నమ్మాడో దాన్నీ దేవునిగా కొలిచే ఆచారం వుంది. చెట్టు, పుట్ట, గుట్ట, రాయి, రప్ప, తల్లి, తండ్రి, ఊరు, కాడు, చెరువు, నిప్పు, నీరు వంటివాటిని నమ్మాడు. అదే అతని నమ్మకం. దాని చుట్టూ నిర్మించుకున్న ఆచారాలే అతని మతం. అది ఎవరినీ కించపరచలేదు. ఎవరితోనూ పోటీపడలేదు. అది యీ నాటికీ ఆదివాసీ, అంటరాని జాతుల ఆవాసాల్లో యిప్పటికీ కొనసాగుతోంది.

ఈ గొప్ప సంస్కృతిని చూసి ఆశ్చర్యపోయిన విదేశీయులు వీలైతే తమ నమ్మకాలలోకి వీటిని తర్జుమా చేసుకున్నారు. తమ ఆలోచనలనూ యీ ప్రజలకు యిచ్చారు తప్ప ఎవ్వరూ వీటితో ఘర్షణపడి బాగుపడలేదు. అందుకే ఆర్యులైనా, అరబ్బులైనా, బ్రిటీష్ వారైనా యీ దేశ ప్రజల నమ్మకాలను బలవంతంగా మార్చటానికి ప్రయత్నించలేదు. విదేశాలనుండి వచ్చిన, క్రైస్తవం,

ఇస్లాం, హిందూ వంటి మతాలు కూడా యీ దేశ నమ్మకాల్లో భాగమైపోయాయే తప్ప వాటిని ప్రత్యేకంగా చూడటం జరగలేదు. ముక్కోటి దేవతల్లో యింకో ముగ్గురు చేరితే యీ ప్రజలు సంతోషించారే తప్ప సంకుచితంగా ఆలోచించలేదు. అదే అసలైన భారతీయతా లక్షణం. అది తప్పకుండా వైదిక హిందూత్వానికి వ్యతిరేకమైనది. ఏ కొద్దిమంది అగ్రకుల దురహంకారుల నమ్మకాలను, వారి దేవుళ్లను మాత్రమే ప్రచారం చేసి వేల వేల సంవత్సరాలుగా వస్తున్న భిన్నత్వాన్ని మంట గలుపుతామంటే అంగీకరించే స్థితిలో ప్రజలు లేరు. వేల సంవత్సరాలుగా తమ నమ్మకాలను, తమ నాయకులను అణచివేస్తూ ఎందుకు యిలా పగసాధిస్తున్నారో తెలియక వారిని తలచుకుంటూ 'ఓనమ్' లాంటి పండుగలను కూడా చేసుకు బతుకుతున్న ఈ ప్రజలను కసితో అక్కసుతో ఫాసిస్టు ఆలోచనలతో ఒక విదేశీ శక్తి స్వదేశీ ముసుగులో పొంచివుంది. జాగ్రత్తగా కనిపెట్టాలి. ఈ శక్తి భిన్నత్వానికి వ్యతిరేకమైనది, భారతీయతా తత్వానికి శత్రువు, ఈ దేశ మూలవాసులను మట్టుపెట్టి తమ నమ్మకాలను, దేవుళ్లను యీ ప్రజల మీద రుద్దటానికి, తద్వారా రాజకీయ అధికారాన్ని ఆర్థిక లాభాన్ని పొందటానికి ప్రయత్నం జరుగుతోంది. ఈ ప్రజల మధ్య వుండే సోదరభావాన్ని, సంఘీభావాన్ని ముక్కచెక్కలు చేసి తమవారిని, తమ మాతృ ప్రాంతనమ్మకాలను కాపాడుకుందామని ప్రయత్నిస్తున్నారు. వేల సంవత్సరాలైనా యీ దేశంలో, యీ సంస్కృతిలో ఒక భాగంగా వుంటానికి అంగీకరించటం లేదు. తమ ప్రత్యేకతలను విదేశీయమైన తమ దేవుళ్లను, నమ్మకాలను యీ ప్రజల మీద రుద్దటానికి భిన్నత్వాన్ని నాశనం చేసి తమ సంస్కృతిని రుద్ది ఏకత్వాన్ని సాధించటానికి ప్రయత్నిస్తున్నారు. అందుకు యీ నమ్మకాలను రాజకీయాలతో జోడించి 'లౌకిక' వారసత్వాన్ని గందరగోళం చేసే పరిస్థితులను సృష్టించటానికి అవకాశం కోసం ఎదురుచూస్తున్నారు. వారి ఆలోచనలతో వేల సంవత్సరాలు గడిచినా ఏ మార్పు లేదు. ఆ రోజు సింధు నాగరికతను మట్టుపెట్టినపుడు ప్రదర్శించిన కుటిలత్వం, విభజించి పాలించే ఎత్తుగడలు యిప్పుడూ కన్పిస్తున్నాయి. లౌకికవాదాన్ని మత లౌకికవాదంగా నిర్వచించి సర్వ ధర్మాలను సమానంగా చూస్తామని చేసే ప్రచారంలో ఒక కుట్ర దాగి ఉంది. విదేశాల నుంచి వచ్చిన వైదిక మతం, క్రైస్తవం, ఇస్లాం మూడూ వారి ఉద్దేశంలో సోదర మతాలే. ఆ మూడింటికీ ఆరిజిన్ ఒకే ప్రాంతం, ఒకే సంస్కృతి ఉంది. కాని ఈ దేశ వాసుల నమ్మకాలు, ఈ దేశంలో పుట్టిన తంత్రబౌద్ధం, యింకా ఎన్నో

చిన్న చిన్న మతాలు, చార్వాకం, లోకాయతం, వైదిక వాదులు చెప్పని షట్‌దర్శనాల్లోని ఆలోచనలు, ఆదివాసీల నమ్మకాల గూర్చి మాట్లాడటం లేదు.

వైదిక హిందూ మతంలోని కొన్ని ప్రతికూల అంశాలను కాదని సుమారు 5 వందల ఏళ్లనాడు ఇస్లాం, తరువాత క్రైస్తవ మతాల్లోకి యీ దేశదళితులు వలసలు పోయినా వారి దైనందిన జీవితాల్లో మత ఆచారాల్లో యీనాటికీ గత భారతీయ నమ్మకాల వాసనలే ఎక్కువగా కన్పిస్తాయి. అంటే నూటికి 60 శాతం ప్రజలు వైదిక మతంతో సంబంధం లేనివారే. ఈ పరిస్థితుల్లో కులతత్వంతో కలుషితమైన ఆలోచనను మత రాజకీయాల ద్వారా యీ ప్రజల మీద రుద్దితే వచ్చే అనర్థం మేధావులు అర్థం చేసుకోగలరు. అందుకే ఈ దేశానికి లౌకికవాదం అవసరమయింది. ఈ దేశభిన్నత్వాన్ని, జాతులను, సంస్కృతిని కాపాడాలంటే మతాన్ని రాజ్యంనుండి వేరుచేయాలి. రాజకీయ పార్టీలు మతాలను రెచ్చగొట్టకుండా ఒక చట్టాన్ని రూపొందించాలి. ఈ దేశ భిన్నత్వాన్ని ప్రతిబింబించే చిన్న చిన్న జాతుల ఉనికిని, నమ్మకాలను గౌరవిస్తూ, ఈ దేశ మూలవాసుల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక జీవితాన్ని, అధ్యయనం చేయటానికి అవకాశాలు కల్పించాలి. లౌకికవాదం అంటే సర్వ ధర్మ సమభావం కాదు - రాజ్యానికి, మతానికి సంబంధం లేకపోవడం, వ్యక్తి నమ్మకాలను గౌరవిస్తూ వాటిని వైయుక్తికి ఆచరణలుగానే వుంచాలి తప్ప ప్రభుత్వం వాటిని బహిరంగంగా సమర్థించకూడదు, ప్రోత్సహించకూడదు. అలా చేసినట్లు రుజువైతే ఎన్నికల్లో పోటీచేసే హక్కును కోల్పోయేటట్లు చేయాలి. అప్పుడు ఏమత దురహంకారీ తమ తీవ్రవాదాన్ని ప్రదర్శించలేడు. అప్పుడు ఏ మతమూ తమ ఉనికిని కోల్పోతామనే అభద్రతా భావానికి గురికాదు. అలా జరిగిన నాడు లౌకికవాదానికి ఒక అర్థం, ఆ ఆలోచనలకు ఆచరణయోగ్యతా ఏర్పడతాయి. సకల జాతుల, నమ్మకాల సమ్మిళితమైన భారతదేశం తప్పకుండా అప్పుడు ఏకమై ప్రపంచానికి మార్గదర్శకత్వం వహిస్తుంది.



# మూలవాసుల సంస్కృతిపై వేటు 'భారతీయత'కు చేటు

కొత్తగా అధికారంలోకి వచ్చిన ప్రతి రాజకీయపక్షం తమ భావజాలానికి అనువుగా విద్యావ్యవస్థలో మార్పులు తీసుకురావడానికి పూనుకుంటుంది. కేంద్రంలో బిజెపి ప్రభుత్వం ఇటీవల విద్యామంత్రుల సమావేశంలో చేసిన ప్రయత్నాన్ని ఇందులో భాగంగానే చెప్పుకోవాలి. తమ హిందూత్వ ఎజెండాకు అనువుగా విద్యా విధానంలో మార్పులు తేవాలని బిజెపి తలపెట్టింది. అయితే ఈ దేశ మూలవాసి, ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ మంత్రి శ్రీమతి ప్రతిభాభారతి విద్యా మంత్రుల సమావేశంలో 'హిందూ తత్వాన్ని' దేశ విద్యా విధానంలో చేటుచేసుకోకుండా అడ్డుకున్నారు. బహుశా, తెలుగుదేశం యింకా లౌకిక విధానానికి కట్టుబడి వుందని ప్రకటించటానికి ఇదోమంచి అవకాశంగా ఆమె భావించి వుంటారు. లేక నిజమయిన భారతీయతను అపవిత్రం చేస్తున్నారనే ఆలోచనతోనైనా ఈ పనిని ప్రతిభావంతంగా ఎదుర్కొన్నారు. రాజకీయపార్టీల రాజకీయాలను ఒకవైపున వుంచితే అధికారానికి వచ్చిన ప్రతీ అధికారపార్టీవారు విద్యతో ఆటలాడుకోవటానికి ప్రయత్నించినవారే. ఇది ఇప్పటిదికాదు. వేల సంవత్సరాలుగా జరుగుతున్న తంతు. సింధులోయ నాగరికతలో వున్న అసలైన భారతీయుల సంస్కృతిని, విద్యను మొట్టమొదట నాశనం చేయటం ద్వారా ఈ దేశాన్ని పరదేశీలు తమ 'కబంధ' హస్తాల్లోకి తీసుకున్నారు. అయితే ఈ దేశ ప్రజలు తమ పల్లెల్లో, కోనల్లో ఇప్పటికీ మన సంస్కృతిని, విద్యను కాపాడుకుంటూ వస్తున్నారు. ఇదే పరదేశీయులకు సహించరానిదయింది.

తమ సామ్రాజ్యవాదానికి ఇంకా వీరు లొంగలేదని, వేల సంవత్స రాలైనా తమ ప్రత్యేకతను కాపాడుకుంటున్నారని, ఇన్ని వందల విదేశీ దండయాత్రలు జరిగినా వీళ్ల సంస్కృతి ప్రత్యేకతలో మార్పులేదని గాభరా పడుతున్నారు. తమకు వారసులైన యవనులు, ఇంగ్లీషువారు, హూణులు ఒకరేమిటి ప్రతి దుర్మార్గుడు చేసిన దురాక్రమణలకు ఎదురించి నిలబడ్డ ఈ

దేశ ప్రజల గొప్పతనానికి పరదేశీయులు ఖిన్నులైనారు. అందుకే మళ్లీ విద్యావిధానాన్ని తమ సంస్కృతికి అనుకూలంగా మార్పుచేయాలనే ప్రయత్నం. ఈ ప్రయత్నాన్ని మళ్లీ వ్యతిరేకించింది సింబాలిక్‌గానైనా యీదేశ మూలవాసుల ఆడబిడ్డే. మిగతా రాజకీయపార్టీలు, వామపక్షాలు దీనితో ఏకీభవించటం యింకా ఈ దేశంలో ప్రజాతంత్ర ఆలోచనలకు చోటున్నదని తెలియజేస్తూ వుంది.

భారతదేశంలో ప్రజలకు 'భారతీయత' గూర్చి, తాత్విక విషయాల గురించి తెలియ చెప్పటానికి విద్యా విధానంలో మార్పులు చేయాలని ఇప్పుడు అధికారంలోవున్న రాజకీయ పార్టీ ఆలోచన చేయటంలో తప్పులేదు. అది వారికి అవసరం. గాని అది మాకు సంబంధించింది కాదు అని దాన్ని వ్యతిరేకించటంలో ఆక్షేపణ ఏమీలేదు. ప్రపంచంలో అన్ని దేశాల్లోనూ పాలకులు కొత్తగా అధికారంలోకి వచ్చిన వెంటనే వాళ్ళు చేసే మొట్టమొదటి పని విద్యా విధానాన్ని తమ ఆలోచనల కనుగుణంగా మార్పుచేసుకోవటం. ప్రతి సామ్రాజ్యం ఒక దేశాన్ని కబళించటం ద్వారా ఆ దేశ ప్రజలను తమ సంస్కృతికి అనుకూలంగా మార్పు చేసుకోవటానికి విద్యను మార్చటానికి ప్రయత్నించిన దాఖలాలున్నాయి. ఈ దేశంలో పరదేశీయులైన ఆర్యుల దగ్గర నుండి, అదే సంతతికి చెందిన గ్రీకు దేశీయులు, అరబ్బులు, ఇంగ్లీషువాళ్లు ఇప్పుడు సింధునదికి ఆవల నుండి ఈ దేశానికి వలస వచ్చిన పరదేశీయులైన కొంతమంది అధికారపార్టీ వారు కూడా అదే పని చేయాలని ప్రయత్నిస్తున్నారు. కాని ఎందరు ఎన్ని రకాలుగా ప్రయత్నించినా ప్రపంచంలో దురాక్రమణకు గురైన ఇతర దేశాల ప్రజల కంటే భారతీయులు చాలా ఓర్పుగా తమను తాము కాపాడు కుంటూ ఈ సాంస్కృతిక దురాక్రమణను, సామ్రాజ్యవాద ఆలోచనలను తిప్పి కొడుతూనే వున్నారు. ఇది భారతీయుల ప్రత్యేకతకు ఓ గొప్ప నిదర్శనం.

ఇంతకూ విద్యావిధానంలో ఏ మార్పులు తేవాలని వీరు ప్రయత్నిస్తు న్నారు. హిట్లర్ కూడా జర్మనీ ప్రజలను ఉత్తేజితులను చేయాలని ప్రపంచంలో ఆర్యులే అత్యున్నత మానవులు అని చెప్పటానికి, ప్రజలను యుద్ధోన్ముఖులుగా చేయటానికి ఆ దేశంలో 1940 నుండి విద్యా విధానంలో మార్పులు చేశాడు. చివరకు మట్టికరిచి చరిత్ర హీనుడయ్యాడు. ఇది చరిత్రలో పాలకులు నేర్చుకోవలసిన గుణపాఠం. కాని మనదేశ పాలకులు ఈ విషయాన్ని గ్రహించినట్లు లేదు. గత చరిత్ర ఎలా వున్నా ఇప్పుడు జరుగుతున్న చరిత్రలో ఆస్ట్రేలియా దేశాన్ని ఆక్రమించుకున్న తెల్లవాళ్లను ఎదిరిస్తూ పోరాడిన ఆ దేశ

మూలవాసులు ఆస్ట్రేలియా విద్యావిధానంలో తమ చరిత్ర సంస్కృతిని కాపాడాలని చేసిన పోరాటం, ఆ దేశ విద్యా విధానంలో సమూల మార్పులకు దారి తీస్తోంది. ప్రభుత్వం ఆ దేశ ప్రజల ఆలోచనలకు భిన్నంగా ఏ విధానాన్ని రూపొందించే సాహసం చేయడం లేదు. ఆ దేశ ప్రజల ఆచార వ్యవహారాలను, ప్రత్యేకతలను గౌరవిస్తూ విద్యావిధానంలో వాటిని ఒక భాగంగా రూపొందిస్తు న్నారు. కాని మనదేశంలో పరదేశీయులు యిప్పటికి సింధునది అవలవున్న సంస్కృతిని కాపాడుకోవాలని, ఈ దేశ సంస్కృతి, జ్ఞానాన్ని నాశనం చేసి దాని స్థానంలో వేల ఏళ్ళనాటి తమ పూర్వీకుల ఆలోచనలను విద్యా విధానంగా రూపొందించాలని ప్రయత్నిస్తున్నారు.

భారతదేశం గూర్చి ఇప్పటి మన పాలకులకు పూర్తిగా తెలిసినట్లు లేదు. నిజానికి వారి రాజకీయపార్టీలోనే దీని విషయమై చర్చించినట్లు కనపడదు. ఆ పార్టీలో కూడా ఈ దేశ మూలవాసుల గూర్చి ఈ దేశ ప్రజల సంస్కృతి గూర్చి తెలిసినవాళ్లు, దాన్ని ప్రచారం చేయాలనే ఆలోచన గలవాళ్లు లేకుండా పోరు. అయితే పరదేశీయుల ఆధీనంలో వారి సంస్కృతి లక్షణాలే ఆ పార్టీ ప్రాథమిక ఆలోచనలుగా ప్రచారం చేస్తున్న ఒకవర్గం వారిని ఈ దేశం గూర్చి ఆలోచించనీయిటం లేదేమో? అందుకే భారతదేశం అంటే ఇప్పటికీ వారి ఉద్దేశంలో ఆర్యావర్తమే. అందుకే ఇప్పటికీ వేల సంవత్సరాల క్రితం ఇరాన్ మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్తాన్‌లలో ఆనాటి తమ సాంస్కృతిక వారసులు చేసిన ప్రార్థనలను ఆచార వ్యవహారాలను ఈ దేశంలో ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. పరదేశీయులకు ఎప్పటికీ ఈ సమస్య వుంటుంది. ఈ దేశంలో ఒక భాగంగాలేని వీళ్లు తమ ప్రత్యేకతను కాపాడుకోవటానికి మొత్తం మెజారిటీ ప్రజల ఆలోచనలను తమవైపు తిప్పుకోవటానికి ప్రయత్నిస్తారు. మైనారిటీగావున్న పాలకులకు ఎప్పుడూ ఈ సమస్య వుంటుంది. అందుకు వాళ్లు చేయవలసిన పని సహృదయంతో ఈ దేశవారసత్వాన్ని స్వీకరించి, ఈ దేశ ప్రజల ఉన్నతమైన, మిశ్రమ సంస్కృతిని అంగీకరించాలి. సరస్వతి వందనం ఈ దేశంలో ఏ ప్రజలు ఎలా ఆచరిస్తారో మనకు తెలియదా! రేపు గాయత్రి మంత్రం, తరువాత పురుషసూక్తం ఇలా ఒక్కొక్కటి ప్రవేశపెట్టి దేన్ని సాధించాలని చూస్తున్నారు వందేమాతరం ఏమయ్యింది? అంత మాత్రాన సరస్వతిదేవిని అవమానించినట్టు కాదు. అదో పాఠ్యాంశంగా చెప్పాలి. సరస్వతి అంటే తెలియని తొంబైశాతం ప్రజలకు తప్పనిసరిగా దాన్ని గానం చేయించటం ద్వారా

మైనారిటీగా ఉన్న కొద్దిమంది ఆలోచనలను మెజారిటీపై రుద్దడం అవుతుంది. చిక్కంతా దేశంలో వున్న మెజారిటీ ప్రజలు తమవారు కాదనే వారి ఆలోచనలే ఇలాంటి అపవిత్ర ఆలోచనలకు దారితీస్తాయి. 'సరస్వతినే తీసుకుందాం' ఆమె దేనికి గుర్తు? ఎవరు ఈ సరస్వతిని పూజించేవారు? సరస్వతి తండ్రి, భర్త అయిన బ్రహ్మ (పురాణాల ప్రకారం) ఏ ప్రజల సంస్కృతికి అద్దం పడతాడు. ఇక్కడ దేవుళ్ల ప్రస్తావనకాదు. సరస్వతి ఎవరు అని బడి పిల్లలు అడిగితే సమాధానం చెప్పాలిగదా! ఆర్యుల దేవుడు, ఈ దేశ మూలవాసులను నానాహింసలు పెట్టిన ఇంద్రుడిని దేవుడిగా పూజించాలా? వారి దుర్మార్గాలను ఎదుర్కొని ఈ దేశ ప్రజల స్వాతంత్ర్యాన్ని కాలరాసిన వారికి ఎదురొడ్డి నిలబడ్డ బలిచక్రవర్తిని ఇప్పటికీ తమ 'ఓనమ్' పండుగల్లో కీర్తిస్తూ తమ జ్ఞాపకాల్లో పదిలపరచుకున్న ప్రజల దేవుడు బలి గూర్చి పాఠాలు చెప్పాలి? ఒకప్పుడు ఇటువంటి సమస్యలు లేవనెత్తకపోయినా ఇప్పుడు ప్రజలు అక్షరజ్ఞానం ద్వారా విషయాలను అవగాహన చేసుకుని పరదేశీయులను ప్రశ్నించే స్థాయికి ఎదిగారు. దీన్ని ఘర్షణ స్థాయికి తీసుకుపోకూడదు. అసలు మన పాలకులకు పూర్తిగా భారతదేశం గూర్చి తెలియదు. వారికి తెలిసిందల్లా వేల సంవత్సరాలనాటి తమ కుల పురాణాల ద్వారా కాపాడబడుతున్న పరదేశీ సంస్కృతి మాత్రమే. వారి ఉద్దేశంలో భారతదేశం అంటే పశ్చిమ భారతదేశం, మహా అయితే గంగామైదాన ప్రాంతం. ఈశాన్యం గురించిగాని, తూర్పు, దక్షిణ భారతదేశ ప్రజల గూర్చిగాని ఏమీ తెలియదు. తెలిసినా అది భారతదేశంలో ఒక భాగం కానట్లే భావిస్తున్నారు. అందుకే ఈ ప్రాంతాలకు చెందిన విద్యా మంత్రులు పాలక పక్షం ప్రవేశపెట్టే వారి సంస్కృతి అధారమైన పరదేశీ విధానాన్ని వ్యతిరేకించారు. దురదృష్టవశాత్తు వీరివద్దా ప్రత్యామ్నాయం వున్నట్టులేదు. తమకు నోరు ఉంది గదా అని, తమ చేతుల్లో ప్రచార సాధనాలు, శిక్షణ పొందిన కార్యకర్తల ద్వారా మెజారిటీ ప్రజల నోరు మూయించలేరు.

నిజానికి పాలకులకు నిజాయితీ ఉంటే ముందు భారతీయత అంటే ఏమిటో చర్చకు పెట్టాలి. ఈ దేశ ప్రజలందరకూ తెలిసిన సింధు నాగరికతను కూడా, ఇప్పుడు అది పాకిస్తాన్‌లో వుంది కాబట్టి సరస్వతి నాగరికతగా పిలవాలని ప్రయత్నిస్తున్న కుహనా చరిత్రకారులు ఒక వైపు ఉన్నారు. భారతీయ సంస్కృతిలో హిందూ మతంలోనే ఒక భాగంగా వున్న బ్రాహ్మణీయతను వ్యతిరేకించిన భౌతికవాద కర్తలైన చార్వాక, లోకాయత, మీమాంసకారుల ఆలోచనలను

విస్మరిస్తూ ఏ ఆలోచనలను హిందూ మతంగా ప్రచారం చేయాలని ఈ తాపత్రయం. ఆర్యులు తెచ్చిన సంస్కృతిని కాపాడుకుంటూ బ్రహ్మణీయ హిందూమతంగా కొద్దిమందికి మాత్రమే పరిమితమైన సంస్కృతిని 'భారతీయత'గా ప్రచారం చేయాలనుకుంటున్నారా? ఈ భారతీయత గూర్చి పరిశోధనలే అంతంత మాత్రంగా జరిగాయి, దానికి సంబంధించి పరిశోధనలను ప్రజాస్వామ్యయుతంగా, శాస్త్రీయంగా ఉండేటట్లు ముందు ప్రోత్సహించాలి. నిరక్షరాస్యులైన ప్రజలను ముందు అక్షరాస్యులను చేయాలి. నిరక్షరాస్యులైనా విజ్ఞానాన్ని కాపాడుకుంటూ ఆదిమ విజ్ఞానంగా వున్న ఈ దేశ మూలవాసుల జ్ఞానాన్ని సంస్కరించి పెంచి పోషించాలి. పరదేశీయుల ఆలోచనలలో గొప్ప విషయాలు, అందరికీ ఆమోదయోగ్యమైన వాటిని పాఠ్యాంశాలుగా ప్రాథమికస్థాయి నుండిగాక, సెకండరీ స్థాయిలో పాఠ్యాంశాలుగా చర్చించటంవల్ల నష్టం ఉండదు. ప్రజల మధ్యగల సోదర భావానికి ఒకరిపట్ల ఒకరికి గౌరవభావం ఏర్పడేలా పాఠ్యాంశాలు, ప్రాజెక్ట్‌వర్క్ తదితర అంశాలను రూపొందించాలి. ఇప్పుడు దేశం ముందున్న సమస్య అవిద్య కాదు, అక్షరజ్ఞానం.



# భారతదేశంలో విదేశీయులెవరు?

ఈ మధ్య ఆస్ట్రేలియాలో ఆ దేశ అదిమవాసులకుండే కొన్ని ప్రత్యేక హక్కులను ప్రశ్నిస్తూ ఆస్ట్రేలియాలో రాజ్యాంగపరమైన మార్పులు రావాలని కోరుతూ ఒక చర్చ కొనసాగుతోంది. ప్రపంచ వ్యాప్తంగా జాతుల సమస్యకు ఒక గుర్తింపునిస్తూ సుమారు మూడు సంవత్సరాల క్రితం యు. ఎన్. ఓ. ప్రపంచ స్వదేశీ జాతుల సంవత్సరంగా ప్రకటించారు. ఇటీవల కాలంలో భారతదేశంలో విదేశీయులు - స్వదేశీయులనే చర్చ కొనసాగుతూ ఉంది. ఇది ఎన్నికల కాలంలో రావటంతో రాజకీయ చర్చగా కూడా మారింది. అసలు ప్రపంచంలో నాగరిక రాజ్యాలు వచ్చాక ఆయా దేశాల్లోని ఆదిమ జాతుల గురించి, వారి ఉనికి గురించి పెద్దగా పట్టించుకున్నవారు చాలా తక్కువ. సామాజిక శాస్త్రవేత్తలు, మానవీయ శాస్త్ర పరిశోధకులు తప్పించి ఈ సమస్యను విపులంగా మానవతా దృక్పథంతో ఆలోచించేవారే లేకుండా పోతున్నారు. ఎన్నికల పుణ్యమా అని ఈ సమస్య రాజకీయ చర్చగా కొనసాగడం ఒక విధంగా అవసరమే అనిపిస్తూ ఉంది. అసలు భారతదేశంలో ఈ చర్చ ఎంతో అవసరం. జాతుల ఐక్యత, విచ్ఛిన్నం, నూతన జాతుల ఆవిర్భావం భారతదేశంలో జరిగినంతగా ప్రపంచంలో ఇంకెక్కడా జరగలేదు. ఇటువంటి సమస్యను ఎన్నికల సమయంలో కాకుండా, ఆవేశ పూరితంగా చర్చించకుండా సామరస్యంతో చర్చించి పరిష్కార మార్గాలు చూడకపోతే మన కళ్ళెదుటే ముక్కలైన సోవియట్ యూనియన్ మనకు ఒక దృష్టాంతం కాకమానదు.

అసలు భారతదేశం అంటే ఏమిటి? ఇది భౌగోళిక, నైసర్గిక అంశమా, రాజకీయ, సాంస్కృతిక అంశమా? అన్నది ఒకపక్కన ఉంచితే, భారతదేశం 1947 అగస్టు 15న ఏర్పడిందా లేక అంతకు ముందు నుండి ఉందా? ఈ భారతదేశంలో ఎవరు, ఏయే జాతులు (కులాలు కాదు) వారు, మతాలవారు, తెగలు, కులాలు వారు నివసిస్తున్నారు, వారు మాట్లాడే భాషలేంటి, సామాజిక, ఆర్థిక జీవనం ఎటువంటిది అని మనం పరిశీలన కొనసాగిస్తే ఒక విచిత్రమైన

చర్చలోకి వెళ్ళాల్సి వస్తుంది. ఇప్పుడు భారత ప్రభుత్వం, రాజ్యాంగం గుర్తించిన రాష్ట్రాలు, భాషలు, కులాలు, తెగలను కలుపుకొని వారు భారతదేశం అంటే ఏమనుకుంటున్నారో ప్రశ్నిస్తే ఏమి సమాధానం వస్తుందో చూస్తే బావుంటుంది. అలాగే దేశంలోని మతాలు, రాజకీయ పార్టీలు, కులాలు, భారతదేశం ఎక్కడ ఉందో వారి ఉద్దేశంలో భారతదేశం ఏమిటో ప్రశ్నిస్తే దానికి వచ్చే సమాధానాలను పరిశీలించినా చర్చ ఆసక్తికరంగా కొనసాగుతుంది. భారతమాత ఎలా ఉంటుంది, ఏ భాష మాట్లాడుతుంది, ఆవిడ కులం ఏమిటి, మతం ఏమిటి, ఎక్కడ పుట్టింది, ఆమె ఈ దేశ ప్రజల గురించి ఏమి ఆలోచిస్తోంది లాంటి ప్రశ్నలకు సమాధానం వెతికినా చర్చ సరదాగానే కొనసాగుతుంది. అయితే ఇటీవల దేశ విదేశీయుల చర్చతో ఈ విషయాలేవీ చర్చకు రాకపోవటం శోచనీయం.

కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకుగల ఈ దేశంలో కాశ్మీరుతో మన ప్రశ్న భారతదేశం అంటే ఏమిటి అని ప్రశ్నిస్తే బహుశా సామాన్య ప్రజలూ చెప్పే సమాధానం జమ్మూ కాశ్మీరు దాటి రాదేమో? గుజరాత్, రాజస్తాన్, ఢిల్లీ, పంజాబ్ ప్రజలను అడిగితే భారతదేశం వాళ్ల దృష్టిలో బహుశా హిందీ మాట్లాడే ప్రాంతంగా అనుకోవచ్చు. యు.పి., బీహార్ ప్రజలను ప్రశ్నిస్తే వాళ్లు కలకత్తా నుండి ఢిల్లీ వరకు గల గంగా నదీ పరీవాహక ప్రాంతంగా చెబుతారు. బెంగాల్‌లో ఈ రోజు భారతదేశం అంటే బెంగాలీ మాట్లాడే ప్రాంతం, కొంత వరకు అస్సామ్, ఇటు కటక్ తప్పించి భారతదేశం ఎక్కడుందో వాళ్ళకు తెలియకపోవచ్చు. మధ్యప్రదేశ్ వాళ్ళకు హిందీ ప్రాంతంతోబాటు, ఆంధ్రా, ఒరిస్సా సరిహద్దులు కూడా భారతదేశంలో ఒక భాగం అని అంగీకరించవచ్చు. భారతదేశం అని ఒక తెలుగువాడినో, తమిళవాడినో అడిగితే తప్పకుండా వాళ్ళు సుబ్రమణ్యాభారతి, రాయప్రోలు సుబ్బారావు గీతాలను అతి మధురంగా ఆలపించి ఊగిపోతారు. తమ మాతృభాషతోబాటు హిందీని రాజభాషగా బడిలో నేర్చుకుంటారు, భక్తితో ఉచ్చరిస్తారు. హిందీ టీవీ చానళ్లను నిత్యం పరికిస్తూ వారి సంస్కృతిని, వేషభాషలను అలవర్చుకోవటానికి ప్రయత్నిస్తారు. ఇది వారు వేల సంవత్సరాలుగా నేర్చుకున్న 'దాస్య'రిక సంస్కృతీ ప్రభావం. మరి భారతదేశం జంబూ ద్వీపమా, భరత వర్షమా ఎక్కడ, ఎప్పుడు ప్రారంభ మయింది అని ఆలోచిస్తే వెంటనే సమాధానం దొరకదు. కొంత ప్రయత్నిస్తే మనమీద రుద్దబడ్డ సాహిత్యాన్ని చూస్తే జంబూ ద్వీపం ఎక్కడ ఉందో

సింధూ నాగరికతను తెలిపే సీల్లలో అనేక జంతువులున్నాయి. ఈ దేశ ప్రజలతోబాటు వేల సంవత్సరాలుగా పెరుగుతున్న గేదె, దున్నపోతులు ఈ దేశ ప్రజల సంస్కృతిలో ఒక భాగమైతే ఇరాన్ నుండి ఆవులను వెంట తెచ్చుకున్న ఈ ఆర్యులు ఆవుకంటే ఎక్కువ పాలు ఇచ్చే గేదె, ఎద్దుకంటే బలమైన దున్నపోతు ఉన్నప్పటికీ, ఇవి నల్లగా ఉంటాయి కాబట్టి ఇవి ఈ గెడ్డమీద పుట్టాయి కాబట్టి వాటిని అస్పృశ్యంగా ఇప్పటికీ చూస్తున్నారు. వాటి పాలను తాగుతూ, వాటి కష్టంతో అన్నం తింటూ ఆవు కోసం అర్రులు చాస్తున్న చాంధసత్వం గురించి ఏమి చెప్పగలం? అంటే భారతదేశంలో ఆర్యులు, హూన్‌లు, మంగోల్‌లు, గ్రీకులు, థాయి, ఖ్మేర్‌లవంటి మానవజాతులే గాకుండా ఆవులు కూడా దండయాత్రచేసి, ఇక్కడ అది భారతీయులను, అది భారత జంతువులను ఇంకా అవమానపరుస్తూనే ఉన్నారని ఎవరైనా అంటే దానికి సమాధానం వెతుక్కోవాలి. విచిత్రంగా దక్షిణ భారతదేశంలోని ప్రజలు ఉత్తరాదినగల గంగ, యమునలను పవిత్రంగా భావించి తమ పిల్లలకు వాటి పేర్లు పెట్టుకుంటారు. అక్కడి పర్వతాలను పూజిస్తారు. కారణం, వేల సంవత్సరాలుగా వాటితోగల బంధమే అది. మరి ఉత్తరాదివారు ఎవరూ ఇక్కడి భాషలను మాట్లాడరు. ఈ నదులు వారి దృష్టిలో సామాన్యాలు, వాళ్ళ ఇళ్ళలో ఈ పేర్లు ఉచ్చరించరు. మరి జాతీయ సమగ్రత, ఐక్యత ఎలా వస్తుంది?

భారతదేశానికి ఉన్న సమస్యల్లో అతి ప్రధానమైనది కాందిశీకుల సమస్య. ఇది ఇప్పటిదికాదు. వేలాది సంవత్సరాలుగా వస్తున్న సంస్కృతి - హెరిటేజ్. దీనికి కారణాలను కొంత పరిశీలిస్తే విదేశీయులెవరో కొంతవరకు అర్థం చేసుకోవటానికి అస్కారం ఏర్పడుతుంది. ఈ దేశంలో మానవాళి ప్రధాన జాతులైన నీగ్రో, ఆస్ట్రలాయిడీ, మంగోళియన్స్, మోలానిడ్స్, ఇండిడ్స్ ఉన్నారు. అదే ఈ దేశ ఔన్నత్యానికి, ఏకత (Uniqueness)కు కారణం. ఇప్పటికి సుమారు 30 తరాల నుండి, ప్రతి తరంలోనూ ఈ దేశంపై దాడులు చేస్తూ ఇక్కడ సంపదను అనుభవిస్తూ కాలక్రమేణా ఈ జాతుల్లో సమ్మిళితమవుతూ వస్తున్నారు. నూతన జీవన విధానాలను, సంస్కృతులను సృష్టిస్తూనే ఉన్నారు. ఎన్నో దేశాలను పాలించారు, పాలిస్తూన్నా, ఈ రోజు గయాన, మారిషస్, బంగ్లాదేశ్, నేపాల్, భూటాన్ దేశాలను ఈ దేశ సంతతివారే పరిపాలిస్తున్నారు. అక్కడ ప్రజలు వీరిని విదేశీయులని అనటం లేదు. ఈ దేశ సంపదలో భాగమైన చక్మాలు కాందిశీకులుగా వస్తే వారు అంటరాని కులంవారు కాబట్టి అది కాశీ పండితుల

అంతటి సమస్య కాలేదు. గతంలో బంగ్లా, బర్మా కాందిశీకుల విషయంలో ఇదే జరిగింది. పరదేశ సంస్కృతిని, ప్రజల నమ్మకాలను ఎక్కడో ఎవరో గందరగోళం చేస్తున్నారు. వారు ఒకప్పటి విదేశీయులైనా వారి రక్తంలో ఈనాడు రోమ్, గ్రీక్, థాయిలాండ్, చైనా, శ్రీలంక దేశాల ఆదిమవాసుల రక్తం ప్రవహిస్తూ ఉంది. వాళ్ళు సాంస్కృతిక రంగంలో మూఢంగా ఉండబట్టి ఒక జాతిగా, తరగతిగా ఉంటున్నారేగాని, వేల సంవత్సరాలనాటి ఆర్య, అనార్య తెగల రూపం వారిలో లేదు. తెలుపు, బంగారు రంగు చర్మాలతోబాటు తామ్ర, క్రిష్ణ వర్ణ చర్మాలు లాంటివి అనేక రకాలు దేశంలో ఉన్నాయి. పొడవాటి ముక్కుతోబాటు, చప్పిడి ముక్కులు దేశం నలుమూలలా ఉన్నాయి. వారు అనేక భాషలు మాట్లాడుతున్నారు. ఈ రోజు మనం చూస్తున్న ఎల్.కె. అద్వానీ, సోనియా ఒకే జాతికి చెందినవారు కావచ్చు, మన్మోహన్‌సింగ్, చిదంబరం వేరు ప్రాంతాల్లో ఉన్నప్పటికీ వారు ఈ దేశవాసులే సజాతీయులే.

ఇప్పుడు దేశ – విదేశ సమస్య రావటానికి కారణం ఒక ఉదాహరణతో చెప్పవచ్చు. అమెరికాలో రెడ్ ఇండియన్స్‌ను నాశనం చేసి అక్కడ ఆంగ్లో సేక్సన్స్ ఆధిపత్యాన్ని సంపాదించి ఈ దేశం మాది అన్నట్లుగానే ఉంది. సింధూ నాగరిక సమయం నుండి ఈ దేశ ఆదివాసులుగా, మూలవాసులుగా ఉన్న ఈనాటి అనాగరిక జాతులు ఆకలితో, అజ్ఞానంతో అడవుల్లోను, దేశం యావత్తూ సంచరిస్తున్న సవర, యానాది, చెంచు, గోండు ప్రజలు యీ దేశం మాది, మీరంతా వెనక్కుపొండి అని తిరగబడితే నాగరికులమైన మనం, మిశ్రమ జాతుల నుండి పుట్టి ఈ దేశాన్ని పాలిస్తున్న నాయకులు ఏమికావాలి? దీనికి సమాధానం ఒక్కటే. ఈ విదేశీ సమస్యలను పరిష్కరించాలంటే ఈ దేశ మూలవాసులకు ప్రధానమంత్రి పదవి అప్పజెప్పి వారికి సలహాదారులుగా ఉంటూ భారతీయులు ప్రపంచానికి ఒక నూతన సందేశాన్ని ఇవ్వాలి. అలా చేయగలిగిననాడు భారతదేశం 21వ శతాబ్దంలో కూడా ప్రపంచానికి సింధూ నాగరికతా సౌరభాన్ని అందించగలదు.



వ్యతిరేకించకపోవచ్చు. అయితే ఇప్పుడు ఉన్న కులాల ప్రభుత్వంకాని, ఉన్న కులాల రాజకీయ పార్టీలుగాని చెబుతున్న 'ఆర్థికంగా వెనుకబడిన ఉన్న(త) కులాల'కు రిజర్వేషన్‌లు అన్న విషయాన్ని ఇంతవరకు విశదీకరించలేదు. అక్కడే చిక్కంతావుంది. అందుకే దీన్ని వ్యతిరేకించేందుకు ఆస్కారం కూడా ఉన్నది. 1920 ప్రాంతంలో మద్రాస్ రాష్ట్రంలో జస్టిస్ పార్టీ కుల ఆధారితంగా రిజర్వేషన్లు, కోటాలు పెట్టినప్పుడు అనేక అంశాలు చర్చకు వచ్చాయి. అంతకుముందు కొన్ని శతాబ్దాలుగా దిగువనున్న, లేని కులాల పోరాటాలు, బ్రహ్మణ, బ్రహ్మణేతర కులాల మధ్య వివక్ష వంటి సమస్యలకు ఒక పరిష్కారంగా ఈ కోటా విధానాన్ని ప్రవేశపెట్టారు. దీన్ని రాజ్యాంగంలో కొనసాగించడానికి పెరియార్ మళ్లీ ప్రజా ఉద్యమం చేయడం, రాజకీయ రిజర్వేషన్లను అంబేద్కర్ రాజ్యాంగంలో పెట్టడం జరిగింది. అయితే రాజ్యాంగంలో ఆర్థిక వర్గాల గురించి చర్చించ లేదు. అందుకే రాజ్యాంగ సవరణ చేసైనా ఉన్న(త) కులాలకు రిజర్వేషన్లు ఎన్నికల ముందు పంచిపెడతామంటున్నారు. ఇందులో అన్ని రాజకీయ పార్టీలకు మన ఆర్థిక విధానాల విషయంలో ఉన్నట్లే ఒక అదృశ్య అంగీకారం ఉన్నది. అందుచేత ఈ చర్చలో మేధావులు, అన్ని కులాలవారు పాల్గొనాలి.

## రిజర్వేషన్లు ఎందులో?

ఆర్థికంగా వెనుకబడిన ఉన్న(త) లేక అగ్రవర్ణాలకు రిజర్వేషన్‌లు ఇప్పుడు ఎందులో ఇస్తారు? దళితులు, వెనుకబడిన వర్గాలు ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు అడుగుతున్నారు కాబట్టి, అగ్రవర్ణాలకు రిజర్వేషన్ల కోసం ఉద్యమం చేస్తే - మండల్ సమస్యలకు ప్రపంచీకరణ - ప్రైవేటీకరణతో సమాధానం వచ్చినట్లు ఆలోచిస్తే సరిపోదు. అలా ఆలోచించడం మన గ్రామీణస్థాయిని మించి ఆలోచించే శక్తిలేదని అంగీకరించడమే అవుతోంది. అలా ఆలోచించడం ద్వారా, అప్పట్లో ఒక పద్ధతిలో పోతున్న దేశాన్ని, రాజకీయ, ఆర్థిక వ్యవస్థను గందరగోళపరచారు. మళ్లీ ఇప్పుడు ఇదో తంతు. అయితే గందరగోళాల మధ్య తమ ఇల్లు చక్కబరచుకొనే సామర్థ్యం ఉన్నత వర్గాలకు ఉన్నదేమోగాని, నిమ్నవర్గాలు చాలా నష్టపోయే పరిస్థితి ఉన్నది. అందుకే ఈ 'ఆర్థిక పదం' వెనుక అర్థాన్ని వెదకాలి. ఇప్పటికే ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రాల్లో ఆర్థికంగా వెనుకబడిన విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు ఉన్నాయి. వాటిని జాగ్రత్తగా పరిశీలిస్తే, అవి ఆదాయం ఆధారంగా నిర్ణయించినవిగా అర్థమవుతుంది. నేడు దేశంలోని

పాలన, రాజకీయ వ్యవస్థలో ఆదాయ సర్టిఫికెట్ తేవడం గొప్ప విషయం కాదు. దళితులను వర్గీకరించిన తర్వాతకూడా కొన్ని జిల్లాల్లో ఒకే కులంవారు మూడు సర్టిఫికెట్లు తెచ్చుకొంటున్నారు. కాబట్టి ఆదాయం అధారంగా ఉన్న కులాలవారితో ఆర్థికంగా వెనుకబడిన వర్గాలను విడదీయడం కొంత కష్టమవుతోంది.

## ఆదాయం ఒక్కటే ప్రమాణం కాదు

ఆర్థికంగా ఒక కులంతో వర్గాలను విభజించినప్పుడు, ఒక్క ఆదాయాన్నే పరిగణించకూడదు. మనదేశంలో కులం ఒక పెట్టుబడిగా రూపాంతరం చెందిన తర్వాత, మొత్తం కులం యొక్క ఆర్థిక ఉనికిని అంచనా వేయవలసి ఉంటుంది. అందులో ఈ రిజర్వేషన్లను కులంతో ముడిపెట్టి ఇవ్వడానికి సన్నాహాలు జరుపుతున్నారు కాబట్టి కులం, ఆర్థిక పరిస్థితులను అంచనా వేయలేదు. నేటి ఉదారవాద ఆర్థిక విధానంలో పెట్టుబడికి ప్రధాన అవకాశం ఉన్నది. ఈ రిజర్వేషన్ కూడా పెట్టుబడి విలువను పెంచడానికే ఇస్తున్నారు కదా! ఒక్కొక్క కులానికి ఒక విధమైన సామాజిక పెట్టుబడి ఉన్నది. ఆయా కులాల్లో వుండే అంతర్ముఖ విధానాలు, ఆచారాలు, నెట్‌వర్క్ వంటివాటి ఆధారంగా కుల కట్టుబాట్లు, వాటిని ఉపయోగించి అవకాశాలు సంపాదించడం వంటివి సామాజిక పెట్టుబడి కిందే వస్తాయి. ఉదాహరణకు 1991 తర్వాత కొన్ని కులాలవారే దేశంలో వచ్చిన అవకాశాలను ఎక్కువగా ఉపయోగించు కొన్నారు. రాజకీయాలను, సిద్ధాంతాలను బహిరంగంగా ఏం చెప్పినా, దృశ్యాదృశ్యంగా ప్రతికులం జాతీయస్థాయిలో ఒక యజమానిగా మారి అవకాశాలను ఉపయోగించుకుని కొన్నాళ్లలో కోటీశ్వరులుగా మారిపోయారు. కాని, సుమారు 120 మంది ఎంపిలు ఉన్న దళితులు ఏమీ సాధించుకోలేక పోయారు. 50 మంది ఎంపిలు ఉన్నవారు ప్రధానమంత్రులు, ప్రాధాన్యతగల మంత్రులు అయ్యారు. మెజారిటీ లేకపోయినా నిశ్చింతగా సుస్థిర ప్రభుత్వాలను అందించగలుగుతున్నారు. ఇదెలా జరుగుతోంది? కులాన్ని వనరుగా మార్చుకోబట్టే! దిగువ ఉన్న కులాల్లో ఇటువంటివి ఉండవు. ఈర్ష్య, అహంకారం, అజ్ఞానాలతో అవకాశాలువస్తే ముక్కచెక్కలవుతారు. అంతరంతంగా ఏ విధమైన వ్యవస్థాపరమైన నిర్మాణం వారికి ఉండదు. ఇదంతా ఎందుకంటే, ఒక సామాజిక పెట్టుబడిగా కులాన్ని కూడా ఎలా పరిగణించాలో అంచనా వేయడానికి ఇప్పుడు సమాజ శాస్త్రాల్లో సామాజిక పెట్టుబడిని అంచనా వేయడానికే చాలా మదింపు పద్ధతులు వచ్చాయి. వాటిని ఉపయోగించవచ్చు. అలాగే పెట్టుబడి అంటే

డబ్బు, ఆస్తుల రూపంలో ఉన్నదే కాదు. మానవ విలువను కూడా పెట్టుబడిగా ఆర్థిక శాస్త్రంలో పరిగణిస్తున్నారు. దాన్నే మానవ పెట్టుబడి (హ్యూమన్ క్యాపిటల్) అంటున్నారు. దీని ఆధారంగానే మానవాభివృద్ధి నివేదికలు వస్తున్నాయి. అంటే మానవ పెట్టుబడి విలువను అంచనా వేయాలంటే, ఒక కులంలోని వ్యక్తికిగల విద్య, అనుభవం, ఆరోగ్యం, ఆదాయం ఆధారంగా మదింపు చేయవచ్చు. అంటే ఒక్క తలసరి ఆదాయం వల్లేకాక సామాజిక పెట్టుబడి, మానవ పెట్టుబడి, సాధారణ ఆర్థిక పెట్టుబడుల మొత్తాన్ని అంచనావేయాలి. కులాల వారిగా జాతి సంపదను, వివిధ రంగాల్లో వారి అవకాశాలను అంచనా వేయాలి. విద్యా సూచికల ఆధారంగా వ్యక్తి ఆర్థిక వెసులుబాటుతనాన్ని నిర్ణయించాలి.

కులం ఆధారంగా ఏర్పడిన రిజర్వేషన్‌లకు ఇది వర్తించదు. ఎందుకంటే అక్కడ సామాజికాంశమే ప్రధాన భూమిక వహిస్తోంది. వివక్షతే ఆధారమవుతోంది. అందుచేత వివక్షకు గురైన కులాలకు రిజర్వేషన్లు ఊతకర్రలు అని అన్నారు. కాని నేటి ఆర్థిక వ్యవస్థలో అందరికి అన్ని అవకాశాలు లభిస్తున్నాయి కదా. మార్కెట్‌కు వివక్షత లేదుకదా, అనే వాదనలున్నాయి. అందుకే 'కులం ఆధారంగా రిజర్వేషన్లు ఇవ్వకూడదు. ప్రతిభ అన్నది అన్నింటికి అతీతమైనది. దాని ఆధారంగా అవకాశలు ఇవ్వాలి' అని మండల్ వ్యతిరేక ఉద్యమం వచ్చింది. అయితే మన దేశంలో కుల వివక్షత అన్ని రంగాల్లో ఎంత దారుణంగా కొనసాగుతున్నదో అందరికీ తెలుసు. ఆంధ్రప్రదేశ్‌లో చాలా సంస్థలు వాటిపై సర్వే జరిపాయికూడా. అంతెందుకు, మాదిగ భోజన హోటల్ అని ఎవరైనా ఎక్కడైనా హోటల్ నడపగలరా? మరి బ్రాహ్మణ, క్షత్రియ, మార్వాడి, ఆంధ్ర భోజన హోటళ్లు చక్కగా నడుస్తున్నాయి. ఈ వివక్షత కొనసాగడమే కాదు, రిజర్వేషన్‌లు కావాలంటున్న ఉన్న(త) కులాలుకూడా మేము 'కూటికి పేదలం కాని, కులాలకు కాదు' అనే ఆలోచనను ఆచరణలో కొనసాగిస్తున్నారు. అందుకే దీనికి పరిష్కారం ఆలోచించాలి. అందుకు రిజర్వేషన్లు ఒక్కటేనా, ఇంకేమైనా మార్గాలున్నాయా అని ఆలోచించాలి. ప్రపంచంలో ఇప్పుడు ఉదారవాదాంతక ప్రజాస్వామ్యాలు కొనసాగుతున్నాయి. భారతదేశంలో ఉన్న ప్రజాస్వామ్యం ఎలాంటిదో అనేక విశ్లేషణలున్నాయి. కాని 1991 తర్వాత ఇది పెట్టుబడిదారి మార్కెట్ ఆధారిత ప్రజాస్వామ్యం అని ఇప్పటికి అందరికీ తేటతెల్లమైంది. మరి ఇటువంటి సమాజంలో అన్ని వర్గాల ప్రజలకు అవకాశాలు, ప్రోత్సాహకాలు ఇవ్వాలంటే ఎటువంటి పద్ధతులు అవలంభించాలి? అసలు 'రాజ్యం ప్రమేయం

చాలా తక్కువగా వుండాలి అంటూనే, అదే రాజ్యం ప్రజలకు రక్షణ కల్పించాలి- అందుకే ఉన్న(త) కులాలకు రిజర్వేషన్‌లు ఇస్తున్నాం' అంటే దీన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఈ సమస్యలకు శాశ్వత పరిష్కారాలు ఉండకపోయినా శాస్త్రీయమైన, ఆమోదయోగ్యమైన మార్గాలను చూపించవలసిన బాధ్యత మేధావులు, ప్రజాప్రతినిధులు తదితరులపై ఉన్నది. ఈ సందర్భంగా అమెరికా ఆదర్శం కాకపోయినా - రెండు దేశాల్లో ఉన్న సామాజిక నిర్మాణం, ఇప్పుడు రెండు ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాల్లో సమీప్యత ఉన్నది కాబట్టి కొన్ని విషయాలు పరిశీలించవచ్చు. అమెరికా దేశంలోని ప్రజాస్వామ్యంలో వ్యక్తికి అంత ప్రాధాన్యత వుందో లేదో తెలియదు కాని, ఒక వినియోగదారుడిగా మార్కెట్‌లో అతనికి స్వేచ్ఛ వుందనే నమ్మకాన్ని ఆ వ్యవస్థ కల్పించింది. ఆదేశ ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికి ఆ నమ్మకం చాలా అవసరం.

## ప్రజాస్వామ్య వ్యక్తి హక్కుల కోసం...

ఆ దేశంలోని ప్రజాస్వామ్యంలో ఇప్పుడు వ్యక్తిగత ఆస్థిహక్కుల కోసం జరిగే పోరాటంనుంచి ప్రజాస్వామ్య వ్యక్తి హక్కులకోసం పయనిస్తున్నదని శామ్‌బౌల్స్‌వంటి ఆర్థిక శాస్త్రవేత్తలు అంటున్నారు. అలా జరగడానికి అక్కడ మార్కెట్ అదృశ్యహస్తంగా పనిచేసి ఆర్థికరంగంలో తన పని తాను చేసుకుపోతున్నది. ఆ మార్కెట్‌కు వచ్చే వస్తువు ఎవరు, ఏ కులంవారు, ఏ జాతివారు ఎక్కడ తయారు చేశారన్నదానితో సంబంధం ఉండదు. అవి ఎంత సమర్థంగా తక్కువ ధరలో తయారు చేశారో అదే దాని ఉనికిని మార్కెట్‌ను నిర్ణయిస్తుంది. మరి అదే విధానాన్ని ఆదర్శంగా ఈ దేశంలో ప్రవేశపెట్టిన మన పాలకులు అటువంటి గ్యారంటీ ఇవ్వగలరా? ఇది అనుమానమే! ఎందుకంటే ఇక్కడ తయారయ్యే వస్తువుల్లో చాలా వాటివెనుక కులం ముద్ర ఉన్నది. గతంలో చెప్పినట్లు మాదిగ భోజన హోటల్‌కు పేరు పెట్టినా పెట్టకపోయినా, ఎవరూ దాన్ని ఆదరించరు. అమెరికాలో ఆ పరిస్థితి ఉన్నదా? అందుచేత అమెరికా ఈ దేశంలో వ్యక్తి ప్రాధాన్యంగా సాగే వ్యవస్థ గురించి ఆలోచించలేదు.

## మన దేశంలో కులం విడిగా లేదు

ఈ దేశంలో వ్యక్తి, కులం విడదీసి లేవు. వ్యక్తి తాలూకు శక్తి కులం మీదే ఆధారపడి వుంటుంది. అది ఓటుహక్కయినా, తయారుచేసే కొన్ని వస్తువులైనా, యంత్ర పరికరాల ఆధారంగా వచ్చిన ఉత్పత్తిలో ఈ వివక్షత

లేకపోయినా, గ్రామీణ ప్రాంతాల్లో ఇప్పటికే వస్తుమార్పిడి వెనుక అదృశ్యహస్తంగా కులం కొనసాగుతునే ఉన్నది. అందుకే ప్రజాస్వామ్యంలో ఉత్పత్తి, పంపిణీ, కొనసాగాలంటే ఆర్థిక ప్రజాస్వామ్య విలువలు దెబ్బతినకుండా ఆర్థిక సామర్థ్యం లోపించకుండా రెండూ ఒకేలా కొనసాగాలంటే ఏం చేయాలి? ఈ సమస్యను అమెరికాకూడా ఎదుర్కొంది. అందుకే అది ప్రాతినిధ్య ప్రజాస్వామ్యాన్ని రాజకీయ రంగంలోనే కాదు, ఆర్థిక రంగంలోనూ ప్రవేశపెట్టింది. అందుకు అనుగుణంగానే కార్పొరేట్ విధానాన్ని ప్రవేశ పెట్టింది. కార్పొరేటికరణ జరిగిన పెట్టుబడిదారి విధానంలో వ్యక్తిగత ఆస్తికి అంత ప్రాధాన్యత ఉండదు. అందులో షేర్ హోల్డర్లు వుంటారు. అందరూ కలసి నిర్ణయాలు చేస్తారు. ఈ నిర్ణయాలు చేయడానికి ప్రతినిధులుగా షేర్ హోల్డర్లు, డైరెక్టర్లను ఎన్నుకొంటారు. వారే అందరికీ ప్రతినిధులుగా నిర్ణయాలు చేస్తారు. ఇక్కడే వారికి ఇబ్బందులెదురయ్యాయి. అంతర్జాతీయ మార్కెట్‌లో షేర్ హోల్డర్లు ప్రపంచదేశాలన్నింటినుంచి రావడం, వారికి కూడా ప్రాతినిధ్యం ఇవ్వవలసి రావడంతో 'వైవిధ్యం' ఒక మార్గంగా ఆలోచించారు. అక్కడ కార్పొరేషన్లే రాజకీయాలను, ఆర్థిక రంగాన్ని నిర్వహిస్తాయన్నది జగమెరిగిన సత్యం. అదే పద్ధతిని భారతదేశం ఆచరించగలదా! మండల్ రిజర్వేషన్ సందర్భంగా దేశ ఆర్థికవ్యవస్థ సామర్థ్యాన్ని రిజర్వేషన్ల ద్వారా తగ్గించకూడదనే వాదన బలంగా అన్ని వర్గాల మేధావులు ప్రచారం చేశారు. ప్రైవేటైజేషన్ వచ్చాక మొత్తం అవకాశాలను, ఆర్థిక రంగ శిఖరాలను తమ గుప్పిట్లో కొన్ని కుటుంబాలు, కొన్ని కులాలవారు పెట్టుకొన్నాక ప్రతిభ గురించి మాట్లాడకపోగా, ఉన్న అవకాశాలనుకూడా తమకే రిజర్వేషన్‌ల ద్వారా ఇచ్చేయాలని ఆందోళన చేస్తున్నారు. అందుకు అనువుగా ఏర్పాట్లు జరిగిపోయాయి. ప్రపంచబ్యాంక్ విధానాలుకూడా పేదల మేలుకోసమే అన్నట్లు రాజ్యాంగ 85వ సవరణకూడా దళితుల కోసమే జరిగినా తద్వారా సామర్థ్యం అన్న 335 ఆర్టికల్‌ను నీరుగార్చేందుకు ఆస్కారం ఏర్పడింది.

## గాంధీ, అంబేద్కర్‌ల పూణే ఒడంబడికకు కాలం చెల్లింది

తద్వారా 50 శాతానికి మించిన ఫరవాలేదు, ఉన్న(త) కులాలవారికి రిజర్వేషన్లు ఇవ్వాలంటున్నారు. బహుశా ఇటీవల తీర్పులను బట్టి ఈ అంశాన్ని కోర్టులు కూడా సమర్థించవచ్చు. అంటే ఇప్పుడు దేశం అన్ని రంగాల్లోను అభివృద్ధి చెందింది కాబట్టి ఇటువంటి రిజర్వేషన్ల మూలంగా నష్టం ఉండదు. సమర్థత

దెబ్బతినదు. కులాలను బట్టో, వృత్తిని బట్టో ఇంకో సామాజిక అంశాన్నిబట్టో ఇచ్చే రిజర్వేషన్ల మూలంగా సామర్థ్యం తగ్గిపోవడమంటూ జరగదు. దేశంలో అక్షరాస్యత పెరిగింది, విద్యా విస్తరణ జరిగింది. అందుకే ప్రతి కులానికి అవకాశాలు రావాలి. అటువంటప్పుడు ఇప్పుడున్న రిజర్వేషన్లకు కుల ఆధారిత రిజర్వేషన్లని, వాటికో లేబిల్ తగిలించడం ఇప్పుడు అవసరమా? అందుకే పెట్టుబడిదారి. వ్యవస్థలో వచ్చిన ప్రాతినిధ్య ప్రజాస్వామ్య పద్ధతిని రిజర్వేషన్ల విషయంలో అనుసరించడం అవసరం.

## అది సరిపోదు

భారతదేశంలో రిప్రజింటేటివ్ పద్ధతిలో ప్రజాస్వామ్యాన్ని కాపాడాలంటే ప్రతినిధులను వ్యక్తులుగా పంపించితే సరిపోదు. వ్యక్తి చాలా అరుదుగా మనకు ఇక్కడ దర్శనమిస్తాడు. అందుకే ప్రజాస్వామ్యం అంటే ఏ ప్రజలు అన్న సమస్య వస్తుంది. ఇక్కడి ప్రజాస్వామ్యం షుంపేటర్ చెప్పిన 'రాజకీయ నిర్ణయాలు తీసుకోవడానికి ఏర్పడిన సంస్థాగత ఏర్పాటు, ప్రజల లక్ష్యాలను తెలుసుకొని, ఆ లక్ష్యాలు నెరవేర్చేందుకు ఎన్నికల ద్వారా ప్రజాప్రతినిధులను సమావేశాలకు పంపి నిర్ణయాలు తీసుకోవడమే ప్రజాస్వామ్యం' ఈ ఆశయం భారతదేశంలో నెరవేరాలంటే ప్రస్తుతం కులం ఆధారంగా ఉన్న సమాజంలోని అందరూ దేశ నిర్మాణంలో పాల్గొనాలి. ఆ పని పార్లమెంటరీ ప్రజాస్వామ్యం రాజకీయంగా నిర్వహిస్తున్నా, దాన్ని ఆర్థిక రంగంలో ప్రవేశ పెట్టినప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. రిజర్వేషన్‌ల చర్చ సందర్భంగా ఈ అంశాన్ని ప్రస్తావించడానికి కారణాలు ఇప్పుడు అన్ని కులాలకు రిజర్వేషన్లు వర్తించినప్పుడు ఇంకా ఆ అంశాన్ని రిజర్వేషన్ అని పిలిచే బదులు ప్రజాస్వామ్య విలువల ఆధారితమైన రిప్రజెంటేషన్ ప్రతినిధ్యం అనడం బావుంటుంది. అప్పుడు మిగిలిపోయిన ఒకటి రెండు కులాలను కూడా ఇందులో చేర్చి అందరికి సమాన అవకాశాలు కల్పించే పద్ధతులను ఏర్పాటు చేయాలి.

## అంచనా వేయాలి

అలా చేసే సందర్భంలో ఇప్పుడు కులాల ఆధారంగా ఉన్న సంపదను, అవకాశాలను, పెట్టుబడులను, ఉద్యోగాలను, అధికారాలను మొత్తం అంచనా వేయాలి. జాన్‌రాల్స్ అన్నట్లు సామాజిక న్యాయమనేది సామాజిక వ్యవస్థలో ప్రాథమిక విలువ, ఈ విలువ పెంపొందడానికి ప్రతి ఒక్కరికి స్వేచ్ఛ, అవకాశాలు, సంపద, ఆత్మ గౌరవం అందివ్వాలి. ఇదే సందర్భంలో అమర్త్యసేన్ ఇంకొంచెం

ముందుకువెళ్లి, వ్యక్తుల యోగ్యతలు మాత్రమే వ్యక్తుల సామర్థ్యాల ద్వారా న్యాయాన్ని చేకూర్చలేవని, వివిధ లోపాలతో సతమతమయ్యే వ్యక్తులు కూడా న్యాయం పొందాలంటే వారికి ప్రత్యేక వనరులు అందివ్వడం ద్వారా సామర్థ్యాన్ని పెంచవచ్చు. సామాజిక న్యాయం అంటే అదే.

## అది రిప్రజెంటేషన్ అవుతుంది

మన దేశానికి సంబంధించి అవకాశాల గురించి చర్చించినప్పుడు ఇక్కడ కుల ఆధారితంగా ఉన్న సమాజంలో అన్ని కులాలకు ప్రధానంగా ఎవరికైతే ఇంతకాలం అవకాశాలు నిరాకరించారో వారికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి, మిగతా వారికి కూడా వారి వారి జనాభా నిష్పత్తి ప్రకారం అవకాశాలు కల్పించాలి. అది అప్పుడు రిప్రజెంటేషన్ అవుతుంది. రిజర్వేషన్ అన్నమాటకు మన సమాజంలో న్యూనతా భావం ఉంది. దాని నుంచి బయటపడాలంటే రిప్రజెంటేషన్ ప్రాతినిధ్యం కల్పిస్తున్నట్టు పేర్కొనాలి. అమెరికాలో ఇటువంటి అవకాశాలు అందరికీ కల్పిస్తున్నారో లేదో పరిశీలించడానికి 'ఈ క్వాలిటీ ఆఫ్ ఆపర్చ్యునిటీ కమీషన్' ఉంది. దాని పని ప్రతి రంగంలోను వివిధ జాతుల ప్రజలకు ప్రాతినిధ్యం ఉందా, లేదా చూడడం, అందుకు కావలసిన అవకాశాలు కల్పించే విధంగా ఆయా రంగ అధిపతులను అజమాయిషీ చేయడం. అమెరికాలో ప్రభుత్వ రంగం కంటే ప్రైవేటు రంగమే ఎక్కువగా ఉందన్నది అందరికీ తెలిసిన విషయమే. మనదేశంలో కూడా ప్రైవేటు రంగమే అధికంగా ఆర్థిక లావాదేవీలను కొనసాగిస్తున్నది. ప్రభుత్వ రంగం కుంచించుకుపోతున్నది. అందువల్ల ప్రభుత్వ రంగమా, ప్రైవేటు రంగమా అన్న వ్యత్యాసం లేకుండా దేశంలో జరిగే ప్రతి ఉత్పత్తి, సేవ, పంపిణీవంటి రంగాలలో జనాభా దామాషా ప్రకారం ప్రతి కులానికి ప్రాతినిధ్యం ఉండేటట్లు చట్టం చేయాలి. ఆ చట్టాన్ని అతిక్రమించినవారికి కఠిన శిక్షలు ఉండేలా చూడాలి. అప్పుడు రిజర్వేషన్ల అవసరం ఉండదు. లేకుంటే ఎగువన ఉన్న అగ్రకులాల వారు, దిగువన ఉన్న దళితులు చేసే రిజర్వేషన్ పోరాటాలకు చరమగీతం పాడేందుకు మళ్లీ ఇంకో ఒడంబడిక జరగాలి. పూనా ఒడంబడికలో గాంధీ, అంబేద్కర్ పాల్గొన్నారు. ఈ ఒడంబడిక జరిగి డెబ్బై ఏళ్లయింది. కాలం చెల్లిపోయింది. అటువంటి ఒడంబడికకు దేశం ఇప్పుడు సిద్ధంగా ఉందా, లేక రిప్రజెంటేషన్ పద్ధతితో పరిష్కారం కనుగొంటారా అన్న విషయమై దేశవ్యాప్తంగా చర్చ జరగాలి.



# రిజర్వేషన్లు అడుక్కుంటే ఇస్తారా?

ఈ దేశంలో దేవుడు లేడనే వాళ్లు చాలామంది ఉన్నారు. కాని కులం కాదనుకునేవారే చాలా అరుదు. ఇందుకు కారణం భారతీయ సామాజిక వ్యవస్థ కులం మీద నిర్మించబడింది. అసలు హిందూ మతమంటేనే డా॥ అంబేద్కర్ ప్రకారం కులవ్యవస్థ. ఇది ఒక రోజులో వచ్చింది కాదు. బహుశా స్వామి ధర్మతీర్థ ప్రకారం ఆర్యుల ఆశ్రమ ధర్మాలు వారి తెగలమధ్యగల వర్ణధర్మాలు కలిసి వర్ణాశ్రమ ధర్మంగా మొదట ఇది ప్రారంభమయిందేమో? మొదట్లో ఈ వర్ణాశ్రమ ధర్మాలు ఆర్య తెగలయిన కురు, పురు, యదువంటి తండాల మధ్య ప్రారంభమయి క్రమేపి పెరుగుతూ వచ్చి ఉంటాయి. ఈ విదేశీ తండాలు భారతదేశంలోని నాగరిక తెగలను యుద్ధాల్లో ఓడించి తమలో కలుపుకున్న సందర్భంలో ఈ వర్గం కులంగా రూపాంతరం చెందివుంటుందని ఒక అంచనా. అది నిన్న మొన్నటివరకు ఒరిస్సా వంటి ప్రాంతాల్లో కొనసాగుతూనే ఉందని సామాజిక చరిత్రకారులు చెబుతూనేవున్నారు. కులం ఎలా ప్రారంభమయినా అది వృత్తులను జన్మతః రిజర్వ్‌చేసే వ్యవస్థగా మారింది. అసలు భారతీయ కులవ్యవస్థే ఒక చక్కటి రిజర్వేషన్ విధానం. దానికి రాజ్యాంగ అధికరణలు, ప్రజాస్వామ్యంతో సంబంధంలేదు. ఇప్పటికీ కొన్ని వృత్తులు కొందరికి మాత్రమే రిజర్వు అయ్యాయి. ఉదాహరణకు పురోహిత్యం, పారిశుద్ధ్యంపని. అయితే ఇంత కఠినంగా వుండే ఈ వ్యవస్థకు వ్యతిరేకంగా ఎవరూ పోరాటం చేయలేదా అంటే చరిత్రలో, పురాణాల్లో చాలా ఉదాహరణలున్నాయి.

## విశ్వామిత్రుడి నుండి వి.పి.సింగ్ వరకు

విశ్వామిత్రుడి నుండి వి.పి.సింగ్ వరకు ఈ వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటాలు సాగించారు. బుద్ధుడు తాత్విక ఉద్యమాన్ని మాత్రమే తెచ్చాడంటే పొరపాటు. కులవ్యతిరేక ఉద్యమమే ప్రాథమికమని బిక్కుధమ్మరతన వంటివారు

ఎప్పుడో వివరించారు. అయితే భారతీయ కులవ్యవస్థ బౌద్ధం చాలా ఉన్నతస్థితిలో ఉన్నపుడు నేపాల్‌లోగాని, శ్రీలంకలోగాని లేదని, 14వ శతాబ్దంలో హిందూ పాలకులు నేపాల్‌లోను, 1750లో శ్రీలంకలో అర్థహిందూ పాలకులు వచ్చాక కులవ్యవస్థ పునర్ నిర్మితమయిందని బిక్కుధమ్మరతన వివరించారు. అంటే హిందూ వ్యవస్థ దాని ప్రభావం మూలంగానే కులవ్యవస్థ మనుగడ సాగిస్తోందని పరోక్షంగా చెప్పటం జరిగింది. ఇప్పుడు మనదేశంలో రథాలు అందుకే కదులుతున్నాయి. అయితే దీనికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల చరిత్ర ఎవరూ రాయలేదు. మహాత్మ జ్యోతిరావుపూలే చేసిన ప్రయత్నం కొనసాగలేదు. శంబూకుని చంపిన తరువాత ఏం జరిగింది? సరయూనదిలో శ్రీరామచంద్రుడు నిజంగానే ఆత్మహత్య చేసుకున్నాడా? ప్రహ్లాదుని జీవిత చరమాంకం ఎలా ముగిసింది? ఏకలవ్యుని బొటనవేలు తెగ్గోస్తే ఆదివాసీలు ఊరుకున్నారా? ఆళ్వారులు ఎందరు వచ్చారు? చోకమేళా, రవి దాస్‌లు ఏ ఉద్యమాలను నడిపారు? ఈ దేశ 'నేటివ్ ఇండియన్స్' చారిత్రక మూలాలేమిటి? అన్నవి శాస్త్రీయంగా పరిశోధించి వివరాలు తెలుసుకుంటే తప్ప ఎంత పోరాటం ఉందో తెలియదు. భారతదేశంలో కులవ్యవస్థకు వ్యతిరేకంగా ప్రతి తరంలోనూ పోరాటాలు జరిగాయి. తద్వారా కొన్ని రాయితీలు పొందారు. ఇప్పుడు కొన్ని కులాలకు ఇస్తున్న రిజర్వేషన్‌ల వెనుక చాలచరిత్ర ఉంది. ఇదేదో రాజ్యాంగం ద్వారా వచ్చిందనుకుంటే పొరపాటు.

## బ్రిటిష్‌వారి మధ్యవర్తిత్వం

బ్రిటిష్ వారు ప్రవేశించిన తరువాత ఈ దేశంలో కింది కులాలవారికి ఒక మధ్యవర్తి దొరికాడు. బ్రిటిష్‌వారు కూడా తెలివిగా సామాజిక విషయాల్లో మధ్యవర్తిత్వం వహించటం జరిగింది. అందుకే బ్రహ్మణీయ హిందూమతంలోని కుల దురహంకారానికి ఖిన్నులైన దక్షిణ దేశ పాలకులు (దక్షిణలో క్షత్రియులు లేరు) ఈ వ్యవస్థనుంచి బయట పడాలంటే ఎలా అని ఆలోచిస్తూ సమయంకోసం వేచి ఉన్నారు. మైసూర్ మహారాజ దేశంలోనే మొదటిసారి జూన్ 19, 21, 1895లో ఒక సర్క్యులర్ ద్వారా కొన్ని పదవులను వెనుకబడిన కులాలకు రిజర్వ్ చేశారు. 1872లో బ్రిటిష్‌వారు కేస్ట్ డిస్‌ఎబిలిటీస్ ఏక్ట్ ప్రవేశపెట్టారు. 1902లో సాహు మహా 'జ్ కొల్హాపూర్ సంస్థానంలోగల ఉద్యోగాల్లో 50శాతం ఉద్యోగాలను వెనుక డిన కులాలకు రిజర్వ్ చేశారు. నిజానికి ఈ రిజర్వేషన్‌ల చరిత్ర బ్రిటిష్‌వార ప్రవేశపెట్టిన విద్యావిధానంద్వారా మాత్రమే వచ్చింది.

విద్యారంగంలో అతి తక్కువ నిష్పత్తిగల ప్రతివర్గం ఫీజులో కన్‌సెషన్ కోసం అర్జీలు పెట్టుకున్నారు. ఇందులో ముఖ్యంగా ముస్లింలు ఆ రోజున ముందు ఉన్నారు. ఇదంతా పరిశీలించడానికి 1882లో బ్రిటిష్‌వారు హంటర్ కమిషన్‌ను నియమించారు. ఆ కమిషన్‌ముందు జ్యోతిరావుపూలే మెమోరాండం సమర్పిస్తూ వెనుకబడిన కులాలకు తగిన ప్రాతినిధ్యం ఇమ్మని కోరాడు. (1935 వరకు వెనుకబడిన, డిప్రెస్‌డు కులాలు అన్న పదాలు అంటరాని వారికి కూడా వర్తిస్తాయి.) ముఖ్యంగా 1882 కమిషన్ పరిశీలనలో గంజాం, జిల్లాలోని ముస్లింల విద్యాపరమైన స్థితిగతులను పరిశీలించి ముస్లింలకు ప్రత్యేక సదుపాయాల కోసం సిఫార్సు చేయడం జరిగింది. అలా ప్రారంభమయిన రిజర్వేషన్ వ్యవహారం 1883లో 11 కులాలతోను, 1893లో 39 కులాలతోను సాగగా 1913 నాటికి కమ్మ, 1933లో కాపు వంటి కులాలు కూడా వెనుకబడిన జాబితాలో చేరిపోయాయి. 1943 నాటికి ఈ కులాలు మారిపోయాయి.

రాజకీయ రిజర్వేషన్‌లకు సంబంధించి మొదటి నుంచి పోరాడినవారు ముస్లింలే. ఇటీవల అలీగఢ్‌లో ఒక సదస్సు జరిగిందని తెలిసింది. ముస్లింలలో ఉన్న వెనుకబడిన కులాలవారు మళ్లీ సంఘటితమవుతున్నారు. తమకు జరుగుతున్న అన్యాయాన్ని అంచనా వేసుకుంటున్నారు. 1908లో మింటో సిఫార్సు మేరకు ముస్లింలకు ప్రత్యేక స్థానాలు కేటాయించబడ్డాయి. దానికోసం ముస్లిం లీగ్ తదితర సంస్థలు ఎలా పోరాటం చేశాయో ఇక్కడ గుర్తు చేసుకోవాలి. ఈ సందర్భంగానే బాబాసాహెబ్ అంబేద్కర్ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌లో ముస్లింలకు ఇస్తున్న మాదిరిగానే 'అంటరాని' వారికి ప్రత్యేక స్థానాలు కోరాడు. 1932 ఏప్రిల్‌లో రామ్సే మేక్‌డొనాల్డ్ అవార్డ్ ప్రకటించడం జరిగింది. దానిని వ్యతిరేకిస్తూ గాంధీ అమరణ దీక్ష, అంబేద్కర్–గాంధీ పూనా ఒడంబడిక అందరికీ తెలిసిందే. దరిమిలా 1935లో వచ్చిన చట్టంలో షెడ్యూల్డ్ కులాలను చేర్చారు. 1950లో వచ్చిన రాజ్యాంగంలో వీరిని చేర్చడంతోపాటు 10 ఏళ్లపాటు రాజకీయ రిజర్వేషన్లు కల్పించారు. దక్షిణాదిలో 1926లో ఏర్పరచిన కులపరమైన రిజర్వేషన్లను కొనసాగించడానికి రాజ్యాంగంలో 15(4) చేర్చారు. ఇందుకూ ఎంతో పోరాటం జరిగింది.

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే ఇటీవల దళితులు, ముఖ్యంగా షెడ్యూల్డ్ కులాలవారు రిజర్వేషన్లు కొనసాగాలని, ప్రైవేట్ రంగంలో కూడా వాటిని కల్పించాలని కోరుతున్నారు. కాని ఎక్కడా గతంలోలా

# ఈ శతాబ్దపు మొదటి ఎన్నికలు దళిత ప్రస్తావన లేకుండా...!

గత ఐదు దశాబ్దాలనుంచి దళితుల ప్రస్తావన లేకుండా ఈ దేశంలో ఎన్నికలు జరగలేదు. రాజ్యాంగంలో పొందుపరచిన రాజకీయ రిజర్వేషన్లే ఇందుకు కారణం. కాని, జరగబోయే సార్వత్రిక ఎన్నికల వాతావరణంలో దళితుల ప్రత్యేక ప్రస్తావన ఏ రాజకీయ పార్టీ తీసుకురాకపోవటం విచిత్రం. దేశంలో దళితులు అదృశ్యమయ్యారా? రూపాంతరం చెందారా? లేక దళితులే నిశ్శబ్దం పాటిస్తున్నారా! రానున్న అంబేద్కర్ జయంతికి చెప్పే ఉపన్యాసాలను మనం ఊహించుకోవచ్చు. 'దళితులు యింకెంతోకాలం పాలితులుగా వుండలేరు. పాలకులుగా మారాలి' అనే అంబేద్కర్ వాక్యాలను దళిత నాయకులు వల్లెవేస్తారు. యిన్నేళ్లయినా ఎందుకు మనకు అధికారం రాలేదనే ఆలోచన వారికి రాకపోవడం వారి సామాజిక వెనుకబాటుతనమా? లేక రాజకీయ అపరిపక్వతా?

## అన్నీ సామాజిక ఉద్యమాలే

ఆధునిక యుగంలో దళిత ఉద్యమాలు, అంబేద్కర్ ఉద్యమాలను పరిశీలిస్తే అవన్నీ సామాజిక ఉద్యమాలుగానే కన్పిస్తాయి. అంబేద్కర్ దళితులపట్ల ఒకే సమగ్ర అవగాహనకు వచ్చినా, ఆయన ఉద్యమం సామాజిక ఉద్యమమనే అందరూ అంగీకరిస్తున్నారు. రాజకీయంగా 1953 తరువాత దెబ్బతిన్న బాల బాబాసాహెబ్ జీవిత చరమాంకంలో తాత్విక పునాదులకోసం, బౌద్ధంకోసం పరితపించి పరమపదించారు. కాని ఆయన చేబట్టిన సామాజిక ఉద్యమం రాజకీయ ఉద్యమంగా రూపాంతరం చెందలేదు. అది రాజ్యాంగ హక్కుల ఉద్యమం, రాజ్యాంగంలో చేర్చిన రాజకీయ రిజర్వేషన్ల కొనసాగింపు ఉద్యమంగానే మిగిలిపోయింది. ఒక జాతి సామాజికంగా చైతన్యం పొందినంత మాత్రాన అది అసంకల్పితంగా రాజకీయ చైతన్యంగానో, ఉద్యమంగానో

మారిపోతుందనుకోడానికి వీల్లేదు. మన దేశంలో సామాజిక చైతన్యం కులచైతన్యంగానే కనిపిస్తుంది. ఈ చైతన్యం ఒక కులానికి జరిగిన అన్యాయం, వివక్షలపై తిరుగుబాటుగా ప్రారంభమై దానినుంచి బైటపడాలంటే రాజకీయ అధికారమొక్కటే మార్గమని నమ్మిన ఉద్యమాలు చాలా ఉన్నాయి. వాటిలో ఈ రోజు అధికార పార్టీలలో ఉన్న కొన్ని సామాజిక వర్గాల చరిత్రను దళితులు పూర్తిగా అవగాహన చేసుకున్నట్లు లేదు. దళితుల చైతన్యం రాజ్యాంగ హక్కులను, ఒడంబడికలను సాధించుకునే దశలోనే కొనసాగింది. దాన్ని మించి ఆలోచించే వాళ్ళను, ఉద్యమాలను దళితులు ఏ విధంగా ఆహ్వానించారో అంచనా వేయవలసివుంది. ఎందుకంటే మిగతా కులాలు తమ సామాజిక చైతన్యాన్ని ఎలా రాజకీయ అధికారంగా మార్చుకున్నాయో తెలుసుకున్నప్పుడు, దళితులు ఎందుకు ముందుకు సాగలేకపోతున్నారో అర్థమవుతుంది. రెండవది, యీ శతాబ్దపు మొదటి ఎన్నికల్లో దళితులకు స్థానం లేనప్పుడు దళితులు ఏ విధంగా స్పందించాలో అర్ధమవుతుంది. ఒక విధంగా దళితుల అజెండా యిప్పుడు ఎల్లలు లేని తెరచిన తెల్లకాగితంగా మారుతుంది. గతంలో అది రాజ్యాంగ నిబంధనలకు, సామాజిక గుర్తింపునకు మధ్య నలిగిపోయింది. కాన్షీరామ్ తెచ్చిన రాజకీయ చైతన్యం కొన్ని చోట్ల దళితుల బేరమాడే శక్తిని పెంచిందేతప్ప శాశ్వతంగా అధికారంలో కొనసాగే అవకాశాన్నివ్వలేదు. కారణం ఆయా ప్రాంతాల్లోని సామాజిక చైతన్యాన్ని వ్యక్తిగా కాన్షీరామ్ రాజకీయ చైతన్యంగా మార్చుకున్నారే తప్ప, జాతి యావత్తూ రాజకీయ చైతన్యం పొందినట్లుగా సంఘటనలు తెలియజేయటం లేదు. ఎన్నికైన బిఎస్పీ శాసనసభ్యులు అందరికంటే ముందు పార్టీలు మారటం వెనుక కాన్షీరామ్ పొరపాటేమీలేదు. దళిత ఉద్యమాల్లో వుండే ఈ బలహీనతల విశ్లేషణను సామాజిక శాస్త్రవేత్తలు పట్టించుకోలేదు. అటువంటి ప్రయత్నం చేస్తే హర్షించగలిగే నాయకులున్నారా?

## కుల తత్వం లేని సమూహం

దళిత చైతన్యంలోని అపరిపక్వ అంశాలను విశ్లేషించి, వారికి దిశానిర్దేశం చేసే ప్రయత్నం, ఏర్పాట్లు వున్నట్లు తెలియదు. అసలు సమస్య - దేశంలో కులతత్వంలేని సమూహం దళితులు మాత్రమే అంటే ఆశ్చర్యపోనక్కర లేదు. అంకెల మీద ఆధారపడి రాజకీయ అధికారం పొందే ప్రజాస్వామ్యంలో, ఏ కులమయితే ఒక మాటపై ఉండి ఏ రాజకీయ పార్టీలో ఉన్నా ఒకవేదికద్వారా ఉనికిని చాటుకుంటాయో ఆ కులాలే అధికారంలోకి వస్తాయి. ఇది అన్ని రాష్ట్రాల్లో

వారినే రాజకీయపార్టీలు ఎంచుకుంటాయి. తద్వారా దళిత రాజకీయ చైతన్యం సన్నగిల్లడమేకాదు వక్రమార్గాన పయనించి వారి ప్రగతి కుంటుబడుతుంది. సంఖ్యరీత్యా ఎంత ఎక్కువ వున్నా ఎవ్వరూ ఆ అంశాన్ని తీవ్రంగా పరిగణించరు. ఇప్పుడు దేశంలోనూ, రాష్ట్రంలోనూ దళితులు ఆ దశకు చేరుకున్నారు. అందుకే దళితుల సమస్య ప్రస్తావించకుండానే రాజకీయపార్టీలు ఈ ఎన్నికలకు సిద్ధమయ్యాయి. ఇది ఈ శతాబ్దపు రాజకీయ పరిణామం!



# ఇఫ్తార్ విందుల్లో దళితులకు ప్రవేశం ఉందా?

## ముస్లింలపై అభిమానం ఉన్న మాంసాహారులైనా గోమాంస ఇఫ్తార్లు ఎందుకివ్వటం లేదు?

రంజాన్ వచ్చేసింది, జాగ్రత్తగా ప్లాన్ చేసుకుంటే ఒక నెలంతా బిరియానీలతో గడిపేయొచ్చని ఓ సెక్యులర్ మిత్రుడు సలహా యిచ్చాడీమధ్య. ముస్లింలు అధికంగా వున్న హైదరాబాద్‌లోనే కాకుండా చిన్న పట్టణాల్లోసైతం ఇటీవల ఇఫ్తార్ విందులు నిర్వహిస్తున్నారు. గత కొన్నాళ్లుగా ముస్లింలను కాల్చుకుతిన్న కుహనా హిందువులు, అవసరమొచ్చినపుడు మాత్రమే ముస్లిం సోదరులని పిలిచే కుహనా లౌకికవాదులు యిప్పుడు ఇఫ్తార్‌లు ఏర్పాటు చేసేస్తున్నారు. ఈ ఇఫ్తార్లలో శాఖాహార ఇఫ్తార్‌లు, మాంసాహార ఇఫ్తార్లు వున్నాయి. కానీ ముస్లింలు యిష్టపడే 'గోమాంస' ఇఫ్తార్లు ఎక్కడా లేకపోవడం విచిత్రం. గోవధ నిషేధం విధించినా ఆవు మాంసం కాదు, ఎద్దు మాంసంపై నిషేధం వుండదుకదా, దాన్ని భుజించవచ్చని ఒక ముస్లిం మేధావి సెలవిచ్చాడు. అందుకే ముస్లింలపై అభిమానం వున్న మాంసాహారులైనా గోమాంస ఇఫ్తార్లు ఎందుకివ్వటంలేదు?

ఇఫ్తార్లలో పాల్గొనే పెద్ద మనుషులను ఒకసారి పరిశీలిస్తే, వారిలో చాలా వరకు ముస్లింలను సామాజికంగా ద్వేషించినవారో, మతపరంగా అనుమానించినవారో అధికంగా కనిపిస్తారు. ఈ సందర్భంగా అయినా ముస్లింలు భారతీయులేనని అంగీకరిస్తే సంతోషం. అయితే ఈ ఇఫ్తార్లలో మాంసాహారులు, ఒకనాటి రక్తసంబంధీకులైన దళితుల ఉనికి కనిపించకపోవటం వింతగాలేదు! ఈ సందర్భంగా డాక్టర్ అంబేద్కర్ ఏ విధంగా ముస్లింలను దూషించారో, ఏ విధంగా ముస్లింలకు దళితులు శత్రువులో వివరిస్తూ ఉత్తరప్రదేశ్‌లో ఈ ఏడాది

జనవరిలో ఒక రాజకీయపార్టీ చేసిన ప్రచారాన్ని గుర్తుచేసుకోవటం అవసరం. ఎందుకంటే దళితులు, ముస్లింలు ఒకే విధమైన సామాజిక, ఆర్థిక నిర్లక్ష్యానికి గురౌతున్నా వక్రభాష్యాలవల్ల వీరు ఒకటి కాలేకపోతున్నారు. నిజానికి అంబేద్కర్ ముస్లింలకు ఎంతదగ్గరివాడో పరిశీలిస్తే అర్థమవుతుంది. అంబేద్కర్ రాజ్యాంగ నిర్మాతగా ఆ చట్ట సభకు ఎన్నికయ్యారంటే యిప్పుడాయన పేరు చెప్పుకు బతికే కొన్ని దళిత కులాలవల్ల కాదు. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చే ఘడియలు, రాజ్యాంగ నిర్మాణంకోసం ఏర్పడే చట్టసభకు అంబేద్కర్‌ను పంపించటానికి బొంబేగాని, మద్రాసుగాని సిద్ధంగా లేవు. తన జాతిని ఆదుకునే అరుదైన అవకాశం తనకు చిక్కదేమోనన్న బెంగతో ఆరోగ్యం కుంటుపడుతున్న తరుణంలో బెంగాల్‌కు చెందిన దళితనామ సూద్రులు, వారి నాయకుడు జోగేంద్రనాథ్ మండల్ అంబేద్కర్‌ను ఆదుకున్నారు. అప్పుడు అంబేద్కర్‌ను ముస్లింలీగ్ మద్దతుతో బెంగాల్ అసెంబ్లీనుంచి ఎన్నుకున్నారు. ఆ విధంగా ముస్లింలు అంబేద్కర్‌ను తమవాడిగానే భావించారు. అంబేద్కర్ సంపాదకత్వంలో వెలువడిన భవిష్కృత భారత్ పత్రికలో 1929 ఏప్రిల్, సెప్టెంబర్ మధ్య ప్రచురించిన వ్యాసాల్లో అంబేద్కర్ ఇస్లాం మతాన్ని పొగుడుతూ అందులో ఉన్న సమానత్వ భావాన్ని దళితులకు వివరించారు. 1935లో తను హిందువుగా కొనసాగదలచుకోలేదని యోలాలో ప్రకటించారు. అపుడు ఆయన అనుయాయులు తమను ఏ మతంలో చేరమంటారో అడగగా, ఇస్లాంలో చేరండని సలహాయిచ్చారు. తాను మాత్రం అవసాన దశలో బౌద్ధంలో చేరారు. ఈ విషయాలను ఆయనకు బంధువైన డా. ఆనంద్ తేల్ తుంబ్డే యిటీవల ఒక వ్యాసంలో వివరించారు. అంతెందుకు మన తెలుగు దళిత బిడ్డ కనుమ ధర్మన్న దళితులు క్రైస్తవం కాదు, ఇస్లాం స్వీకరించండని చెప్పారు. అంటే దళితులు ముస్లింలను ఎప్పుడూ సోదరభావంతోనే చూస్తున్నారనడానికి ఇవి ఉదాహరణలు.

అంబేద్కర్ రచనలను, ముఖ్యంగా పాకిస్తాన్‌పై ఆయన రాసిన పుస్తకానికి వక్రబాష్యం చెబుతూ – అంబేద్కర్ ముస్లింలకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ యిటు అంబేద్కర్‌ను అటు ముస్లింలను దెబ్బతీయాలనే కుట్రతో చాలా మంది ప్రయత్నిస్తున్నారు. అందుకే దళితులు, ముస్లింలు ఆయన రచనలు చదివి వాస్తవాలు తెలుసుకోవాలి. పాకిస్తాన్ విషయంలోకూడా ఆయన హిందూ, ముస్లిం దురహంకారుల్లా ద్విజాతి సిద్ధాంతాన్ని అంగీకరించలేదు. ముస్లిం ప్రజలు పాకిస్తాన్ కావాలని కోరుకున్నప్పుడు స్వయం ప్రతిపత్తి గల దేశంగా పాకిస్తాన్

విడిపోవటం అవసరమే అని చెప్పిన అంబేద్కర్ అందుకు కారణాలుకూడా చెప్పారు. ముస్లింలీగు, కాంగ్రెస్ పార్టీ రెండూ మతదృక్పథంతో యీ సమస్యను చూస్తున్నాయని, నిజానికి ఈ రెండు మతాల్లో వున్న ప్రజలు ఒకే జాతికి, సంస్కృతికి వారసులని అంబేద్కర్ చెప్పారు. భారతదేశం అనేక జాతుల సమ్మేళనం అయినప్పటికీ, ఏ ఒక్కటీ ఒక జాతీయతను సంతరించుకునే విధంగా ఎదగలేదని, అందుకు కారణం మెజారిటీ భారతీయులు మైనార్టీ ప్రజలైన దళితులు, ముస్లింలపట్ల చూపిన అమానుష నిరాదరణే కారణమని అంబేద్కర్ నమ్మారు తప్ప ముస్లింలను ప్రత్యేకంగా చూడలేదు. పాకిస్తాన్ ఏర్పడటానికి తను సుముఖమే అని చెప్పటానికి కారణం, గాంధీ నాయకత్వంలో ఉన్న కాంగ్రెస్ మిగతావారితో అధికారం వంచుకోవటానికి యిష్టపడకపోవటమేనని వివరించారు. రెండో రౌండుటేబుల్ కాన్ఫరెన్సులో తనవాదనతో ముస్లింలు కలవలేదనే బాధ ఉన్నప్పటికీ ముస్లింలు స్వరాజ్యాన్ని అప్పుడు ఆకాంక్షించారు. రెండున్నర సంవత్సరాలకి హిందూ రాష్ట్రాల్లో ముస్లింల స్థితిగతులు తెలుసుకున్న ముస్లింలీగ్ యిక మెజారిటీ ప్రజల అడుగులకు మడుగులొత్తే పరిస్థితి ఉండకూడదని నిర్ణయించుకుని ప్రత్యేక దేశం కావాలని కోరటంలో తప్పులేదని అంబేద్కర్ వాదించారే తప్ప, రెండు జాతుల సిద్ధాంతంపైనో, ముస్లింలు సాంస్కృతికపరంగా, జాతిపరంగా వేరని కాదని ఆయన రచనలద్వారా గ్రహిస్తాం (ఆయన పాకిస్తాన్ పుస్తకంలోని మూడవ అధ్యాయం). మహిళల బురఖా విషయంలో అంబేద్కర్ ముస్లింలను తీవ్రంగా విమర్శించారు. బురఖావల్ల మహిళలకు మానసికంగా, శారీరకంగా పోషకవిలువలు అందటంలేదని, అది తొలగిపోవాలని కోరుకున్నారు. కొంతమంది ముస్లిం నాయకులు, పెద్దలు - హిందూ అగ్రకులాలకంటే ఎక్కువగా దళితులను దగ్గరకు రానీయటం లేదు. బహుశా హిందూ ఆర్యులు తాము సజాతీయులైన ఆర్య సంతతి అనే భ్రమలు వున్నాయేమో తెలియదు.

అందుకే యిటువంటివారు ఏర్పాటుచేసే ఇఫ్తార్లలో దళితులు అస్పృశ్యులుగానే ఉంటున్నారు. మెజారిటీ ముస్లింలు భారతీయ సంతతివారు పూర్వ దళితులేనన్నది వారు సృష్టించిన కొన్ని ప్రత్యేక భారతీయ ముస్లిం సంకేతాలైన పీర్ల పండగల ద్వారా అర్థమవుతోంది. అయితే అంబేద్కర్ అన్నట్టు ముస్లింలు, వారి నాయకులు రాజకీయ ఆలోచనలు లేనివారు. మతంపట్ల వారికున్న విశ్వాసం కొంచెం సడలించి సెక్యులర్ జీవితంలోని అంశాల ద్వారా

రాజకీయాలలో ప్రవేశిస్తే వారు తప్పకుండా దేశ రాజకీయాలను మార్చగలరు. ఆంధ్రప్రదేశ్‌లో 8 జిల్లాల్లో ముస్లింలు, దళితులు కలిస్తే సుమారు జనాభాలో సగంమంది వున్నారు.

ఈ రెండు సమూహాలు (జాతులు) ఒకటై రాజకీయ చైతన్యంతో కదిలితే రాజకీయాలను శాసించగలరు. అందుకే ఇఫ్తార్‌లు దళిత, ముస్లిం సహపంక్తి భోజనాలుగా మారాలి.



# హిందూ సాంప్రదాయంలో కోయిల కన్న 'ముఖ్య'మైన నెమలి

ఈ మధ్యనో మిత్రుడు నా దగ్గరకు వచ్చి, 'మన దేశంలోని కోయిల ఎంతో అందంగా పాడుతుంది. అంత అందమైన పక్షినికాదని నెమలిని జాతీయ పక్షిగా ఎందుకు చేశారో మీకు తెలుసా' అని అడిగాడు. నిజమే ఆయన కళలను అధ్యయనం చేసే చరిత్రకారుడిగా యీ ప్రశ్నకు సమాధానం వెతకటం సహేతుకమే అనిపించింది. అయితే ఈ దేశంలో చరిత్రను అవగాహన చేసుకోవాలంటే గతితర్కంతోబాటు విదేశీ పాలకులు, విదేశీ అనాగరికతండాలు యీ దేశ ప్రజలపై రుద్దిన అనేక నమ్మకాలు, ఆలోచనతోబాటు ఏర్పరచిన 'సంజ్ఞ' (Symbols) లను కూడా అర్థం చేసుకోవాలి. అలా అర్థం చేసుకుంటే మనుషుల నమ్మకాలు, వ్యవస్థలతోబాటు జంతువులు, వక్షుల - అవతారాలు అర్థమవుతాయి. నెమలి నాగుపాముకు శత్రువు. ఈ దేశ ప్రజలు నాగ జాతివారని, వారి భాష తమిళ, దమిల, ద్రావిడగా రూపాంతరం చెందిందని కొంతమంది చరిత్రకారులు రెండు మూడు శతాబ్దాలుగా చెబుతూనే వున్నారు. ఇప్పుడు నెమలి యీ దేశ ప్రజల శత్రువులైనవారే జాతీయ పక్షిగా ఎన్నుకొని తమ అక్కస్సును యీ విధంగా ప్రజల నమ్మకాల్లో వదిలపరిచారని అర్థం చేసుకోవటానికి వీలుంది. ఇదే సందర్భంలో ఇటీవల హర్యానాలో ఆవును చంపి చర్మాన్ని తీశారనే నెపం మీద ఐదుగురు దళితులను చంపేసిన వైనం అర్థం చేసుకోవటానికి ప్రయత్నిద్దాం.

ఆర్య, ద్రావిడ లేక నేటివ్ ఇండియన్ ప్రజలకు సంబంధించిన చరిత్ర పూర్తిగా మనకు అందుబాటులోకి రాలేదు. మరి ఎంతో క్లిష్టమైన మిగతా ప్రజల చరిత్ర, ఆగ్నేయ ఆసియా, చైనా దేశాల చరిత్ర లభ్యమవుతోంది. విచిత్రం కంప్యూటర్లు వినియోగించినా మొహెంజదారో, హరప్పా చరిత్ర మనకు అందుబాటులోకిరాదు. ఈ దేశ నేటివ్ ఇండియన్సు తమ చరిత్రను రాసేస్థితికి

వస్తే తప్ప అది సాధ్యపడకపోవచ్చు. ఎందుకంటే యీ దేశప్రజల జీవితాలతో, నమ్మకాలతో ముడిపెట్టిన 'మహిషం' (దున్నపోతు) గూర్చి ఎక్కడా చర్చకు రాకపోవటం శోచనీయం. 1997లో నేను రాసిన 'వార్త' వ్యాసం ఆధారంగా కొంతమంది మిత్రులు ఆ విషయమై చర్చిస్తున్నా అందుకు వ్యతిరేకంగా ఆవును ఎందుకు తెచ్చారో మనకిప్పటికీ తెలియదు. మొహెంజదారో, హరప్పా సీళ్లలో (Seals) వున్న దేవుడులాంటి వ్యక్తి నెత్తిమీద అలంకారం, మన ఆదివాసీలు తమ పండగల్లో అలంకరించుకునే దున్నపోతు కొమ్ములు ఒకేలా ఎందుకున్నాయి? ఈ దేశ రాజుల్లో ఒకరైన మహిషాసురుణ్ణి ఒక మహిళతో హతమార్చి ఆయన పాలించిన మైసూర్ దేశాన్ని విదేశీయులు ఎలా హస్తగతం చేసుకున్నారో పురాణాల్లో తప్పిస్తే చరిత్రలో ఆధారాలు దొరకవు. ఆవు గురించి చర్చించేముందు గేదె (మహిషం) గురించి ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే యీ దేశ ప్రజల మొదటి ఆరాధ్య జంతువు మహిషం. ఈ గెడ్డ మీదపుట్టి యీ దేశాన్ని సస్యశ్యామలం చేసిన జంతువు గేదె, దున్నపోతు. ఈ దేశాన్నే కాదు, దక్షిణాసియా దేశాలన్నింటినీ వ్యవసాయకంగా అభివృద్ధిచేసిన జంతువు గేదె.

ఆవు, ఆర్యుల్లాగే యీ దేశ జంతువు కాదనటానికి చాలా ఆధారాలున్నాయి. అవు ఉష్ణమండలం జంతువు కాదు. సైబీరియాకు దిగువన వున్న మైదాన ప్రాంతాల్లో వుండేదని సోవియట్ విద్యార్థులకు అక్కడి జంతు శాస్త్రంలో చెబుతున్నారు. ఆవు బేరింగ్ జలసంధిలో కూడా వుండేది. అంతెందుకు రుగ్వేదంలోని నలుబది ఏడవ సూక్తం 20వ రుక్కు యీలా అంటోంది. 'దేవతలారా! మీరు తిరిగి తిరిగి గోవులు లేనట్టియు, దస్యులకు నిలయమై నట్టియు ప్రదేశమునకు వచ్చినారు' (రుగ్వేద సంహిత 2 డా. దాశరథి అనువాదం). అందుకే ఆవును విదేశీయ జంతువుగానే పరిగణించాలి. దానిని పెంచి పోషిస్తూ దాని చుట్టూ నిర్మించుకున్న కర్మలు, వ్యవస్థలు ఆర్యులకు పరమపవిత్రమై వుండొచ్చు. ఆ విధంగా వారుకూడా కాశ్యపుని సముద్రం (కాస్పియన్ సీ) ప్రాంతం నుండి వచ్చినవారుగానే పరిగణించాలి. ఆవు గురించి సామవేద బ్రాహ్మణాల్లో పంచవింశత్ (25) సత్‌వింశత్ (26) బ్రాహ్మణాల్లో గోవులపండగ గురించి చెప్పుకున్నారు. ఆవు వారి జీవిత గమ్యానికి ప్రధానం. ఆవు దేవితో, తల్లితో, అదితితో సమానం. అందుకే పంచగావ్యం లేక పంచాష్టకం అంటే ఆవు పాలు, పేడ, వెన్న, పెరుగు, మూత్రం ఆర్యకర్మల్లో ప్రధానం. అంత పవిత్రమయింది గనుకే దాన్ని బలి యిచ్చేవారు. ప్రముఖ చరిత్రకారుడు

డి.యన్. ఝా గోమాంస భక్షణ రుగ్వేద కాలంనుండీ వుందని నిరూపిస్తూ ప్రచురించిన పుస్తకాన్ని విదేశీ తాబేదారులు స్వదేశీ సంస్కృతి పేరుమీద దేశంలో నిషేధించాలని కోరుతున్నారు. బహుశా వారు చూడలేదేమో యీ అంశంమీద ఎన్నో పుస్తకాలు యిప్పటికే వెలువడి వున్నాయి. ముఖ్యంగా డా. అంబేద్కర్ అంటరానితనం చరిత్ర గురించిరాస్తూ ఆవు మాంసాన్ని ఆర్యులెలా భక్షించేవారో, బ్రాహ్మణ పురోహితులకు అది ఎంత యిష్టంగా వుండేదో సోదాహరణంగా వివరించారు. ముఖ్యంగా గోవధను, మనువు నిషేధించలేదు. అశోకుని శాసనాల్లో గోవధ నిషేధంలేదు. జంతు వధ నిషేధంవుంది. గోవు పవిత్రమైన జంతువే అయితే దాన్ని సంహరించటం ప్రత్యేకంగా నిషేధించేవారు. గాని, పుష్యమిత్రసుంగుని రాకతో ఎదిగిన బ్రాహ్మణీయ హిందూ మతం, బౌద్ధానికి వ్యతిరేకంగా ఎదగాలంటే గోవధ నిషేధించటం, బ్రాహ్మణ పురోహితులు శాకాహారులుగా మారటం ఒక ఎత్తుగడగా ఎంచుకున్నారని అంబేద్కర్ వివరించారు. గోవును ఒక సంస్కృతి, ఒక జాతి సంజ్ఞగా రూపొందించి దాన్ని పరమ పవిత్రంగా తయారుచేసి లేనిపోని శక్తులను ఆపాదించటంద్వారా మొత్తం దేశంలోని ప్రజలందరికీ దానిని ఆరాధ్య దైవంగా మార్చారు. అందుకే ముస్లిం పాలకులైన బాబర్, అక్బర్, ఔరంగజేబు గోవధను నిషేధించారు. దయానందసరస్వతి దాన్ని ఒక రాజకీయ ఆయుధంగా ఎంచుకున్నారు. దరిమిలా 1880-90 ప్రాంతంలో అజామ్‌గఢ్ జిల్లాలో వందలాదిమంది ప్రజల ప్రాణాలను ఆవులు మింగేశాయి. ఆవు కోసం వేలాది మంది ప్రజలను ఉన్మాదంలోకినెట్టే ప్రసంగాలు చేసి, ఉద్యమాలు నిర్మించారు. అందుకు కారణం ఆవు కొద్దిమంది ప్రజల గత కాలపు సాంస్కృతికచిహ్నం. విచిత్రంగా ఆ చిహ్నమే యిప్పుడు వారిని విదేశీయులుగా నిలబెట్టే పరిస్థితి తెచ్చింది. ప్రస్తుం అంత సాహసం ఎవరూ చేయలేదు. ఎందుకంటే విదేశీ పాలకులకు స్వదేశీ ప్రజలపై వుండే అక్కసుతోబాటు, అసహనం, అభద్రతా భావం మూలంగా విచిత్ర ప్రచారాలతో అబద్ధాలను నిజాలను చేసే యంత్రాంగం నిర్మించుకున్నారు. అందులో భాగంగానే తమ నమ్మకాలను, వాటిలోని విదేశీ వాసనలను కప్పిపుచ్చటానికి తీవ్రవాద పోకడలతో యిటీవల దాడులు చేస్తున్నారు. దాని కొనసాగింపుగానే హర్యానా సంఘటనలను అర్థం చేసుకోవాలి.

ఆవుకు అంతటి పవిత్రత ఆపాదించటానికి ఉండే ఆర్థిక కారణాలను మరికొంతమంది నయా వైదిక చరిత్రకారులు చెబుతున్నారు. ఆ విషయాన్ని

కూడా పరిశీలించాలి. ఈ దేశ మెజారిటీ ప్రజలలాగే గేదె నల్లగా వుండటమేకాదు, చాలా బలమైనది. గంగా మైదాన ప్రాంతాన్ని, మగధ దేశాన్ని సుసంపన్నం చేసినవి గేదె, దున్నపోతు. ఆవు ప్రవేశించక ముందు హరప్పా, మొహెంజదారోలాంటి ఉన్నతమైన నాగరికతకు మూలమయింది. అంతెందుకు, ప్రపంచంలోని 58శాతం గేదెలు, దున్నపోతులు భారతదేశంలో యిప్పుడు వున్నాయంటే వాటి చరిత్ర ఏంటో అర్థమవుతుంది. గేదెపాలతోనే దేశంలో తెల్లవిప్లవం వచ్చి ప్రపంచంలో భారతదేశం పాల ఉత్పత్తిలో మొదటి స్థానానికి వెళ్లటానికి కారణమయింది. భారతదేశంలోని ఆవులు ప్రపంచంలో కేవలం పదహారుశాతం మాత్రమే వున్నాయి. పైగా అవు ఒక category కాకుండా అనేక రకాలుగా మారుతూ వచ్చింది. పాశ్చాత్య దేశాల్లో ఆవు సర్వస్వం. మాంసానికి, పాలకు, మిగతాపనులకు వివిధ రకాలుగా సంకరజాతులను తయారుచేసుకున్నారు. ఆవు మాంసం వల్ల ఏడాదికి రూ. 1450 కోట్ల విదేశీ ద్రవ్యం, తోళ్లు, తోళ్ల వస్తువుల ద్వారా రూ. 1745 కోట్లు సంపాదిస్తున్నాం. హర్యానాలో హతులైన దళితులు యీ ఆదాయాన్ని అనుభవించారా, లేక ఆ ఆదాయాన్ని సంపాదించిపెట్టే హిందూవ్యాపారులకు ఊడిగం చేశారా! సమాధానం చెప్పవలసింది విదేశీ ఆవును పూజించే స్వదేశీయులే?



# మాయావతి హిడింబి వారసురాలు

మే నెలలో ముఖ్యమైన ఘటనలు దేశంలో జరిగాయి. మహిళా రిజర్వేషన్ బిల్లు మళ్లీ యథాతథ పరిస్థితికి వచ్చింది. మే నెలలో ఉక్కు మహిళ మాయావతి మూడోసారి ముఖ్యమంత్రిగా ఏడాది కాలం పూర్తిచేసుకున్నారు. ద్రావిడ కళగంకు చెందిన ఇంగ్లీషు మాసపత్రిక అట్టమీద పెరియార్ సతీమణి నాగమ్మాయి, మాయావతి ఫోటోలను పక్కపక్కనే ప్రముఖంగా ప్రచురించి, డికె కార్యదర్శి వీరమణి మాయావతి దక్షతపై సంపాదకీయం రాశారు. మనువాదులపై మాయావతి తనశైలిలో కొంత మార్పును ప్రకటించారు. అయితే మాయావతి పార్టీ నాయకుడైన కాన్షీరామ్ భారత దేశ సమాజాన్ని రెండు భాగాలుగా విభజించి విశ్లేషణ చేశాడు. ఆ సందర్భంగా 'మనువాదులు' అన్న మాటను ప్రచారం చేశాడు. భారతదేశంలో సమాజం ద్విజకులాలు, ద్విజేతర కులాలుగా విడిపడివుందని, ద్విజేతరులైన 85శాతం ప్రజలను, మైనార్టీలయిన 15శాతం ప్రజలు కులం పేరు మీద విభజించి, పాలిస్తున్నారని, వారే మనువాదులని ప్రచారం చేస్తున్నారు. ఇంతకీ పార్లమెంటులో వీగిపోయిన మహిళా రిజర్వేషన్ బిల్లు ఎవరివల్ల వీగిపోయిందో పత్రికలు చెప్పలేకపోయాయి. అందుకే ఈ సందర్భంగా మాయావతి పరిపాలనా దక్షతను దృష్టిలో ఉంచుకుని ఆమె దేశ ప్రధాని అయివుంటే మహిళా రిజర్వేషన్ బిల్లు వీగిపోయేదా! అన్న విషయం చర్చించాలి. మాయావతి రిజర్వేషన్ లేకుండా పార్లమెంటుకు ఎన్నికవుతుందా? ఈ పరిస్థితి దేశంలో నేడు ఉందా? మహిళలంతా రాజకీయంగా ఒక్కటేనా?

భారతదేశంలో మనుధర్మం ఇంకా కొనసాగుతోందని కొందరు, అసలు ధర్మమే రక్షింపబడకపోతే మనకు రక్షణ వుందా? అని మరికొందరు వాదులాడుకుంటున్నారు. మరికొంత మంది మేధావులు విదేశాల్లో చదువుకుని మనుధర్మం గొప్ప సామాజిక ధర్మమని, అది సామాజిక నియమాలకు, కట్టుబాట్లకు నమూనా వంటిదే తప్ప దేశంలో ఎప్పుడూ ప్రవేశపెట్టలేదని

వాదిస్తున్నారు. ఏది ఏమైనప్పటికీ మహిళా రిజర్వేషన్ బిల్లు ప్రవేశపెట్టిన సందర్భంగా మహిళలకు ఉండే హక్కుల గూర్చి మాట్లాడిన నాయకత్వం ఎక్కడా మనుధర్మ శాస్త్రాన్ని ఎదిరించినట్టు కనబడదు. పరోక్షంగా ఆ ధర్మం తాలూకు నియమాలను పురుషాధిక్యాన్ని ప్రదర్శించే ప్రయత్నాలే చేశారు. అంతా కలసి ఆ బిల్లును తుంగలో తొక్కడానికి ప్రయత్నం చేశారు. ఈ విషయంలో మహిళలు ప్రత్యేక వర్ణంగా వున్నారనుకుంటే పొరపాటే!

చట్టాల ద్వారానే సమానత్వం వస్తుందనుకుంటే 150 ఏళ్ల క్రితం బ్రిటిష్‌వాడు ప్రవేశపెట్టిన అస్పృశ్యతా నివారణ చట్టం, వారి హయంలోనే ఏర్పడిన అన్ని కుల నిష్పత్తిలపై ఆధారపడి ఏర్పరచిన రిజర్వేషన్‌లతో భారతదేశం ఆ సమస్యలనుంచి బయటపడివుండేది. అలా జరగకపోవడానికి కారణం భారతదేశ సామాజిక చట్టం అన్ని ప్రాంతాల్లోనూ, అన్ని సందర్భాల్లోనూ ఒకేలా లేకపోవడం. ప్రభుత్వాలు, సంస్కర్తలు, సామాజిక శాస్త్రవేత్తలు కోరుకున్నట్టు సమాజం ప్రయోగశాలల్లో మారినట్టు మారిపోదు. అందుకు ఎంతో కృషి, చిత్తశుద్ధి కావాలి. మహిళా రిజర్వేషన్ బిల్లులో అవి ఎంత వరకు ఉన్నాయో వెతుక్కోవాలి. అసలు ఆ బిల్లులో మహిళలకు అధికారమా, లేక మహిళల ద్వారా అధికారమా! ఏం కోరుకుంటున్నారు? మహిళలకు అధికారం ఇస్తే ఏం చేస్తారు? ఈ విషయాన్ని మాయావతి ప్రభుత్వం చక్కగా చేసి చూపిస్తోంది. యుపిలో అధికారంలో వున్న బిఎస్‌పి మనుధర్మాన్ని పూర్తిగా అర్థం చేసుకుంది. మనుధర్మం ఒక్క సామాజిక నీతిలోనే లేదు. రాజకీయ, ఆర్థిక ధర్మాల్లో నిభిడీకృతమై వుంది. అందువల్ల మొదట్లో అంబేద్కర్ సామాజిక మార్పుతో ప్రభావితమై సాంఘిక న్యాయ పోరాటాలు చేసిన కాన్షీరామ్, తద్వారా సాధించింది చాలా తక్కువని గ్రహించి, రాజకీయ అధికారం కోసం పంథా మార్చుకున్నాడు. సామాజిక మార్పు అంటే దళితులను బ్రాహ్మణీకరించాలి. ఎందుకంటే ఈ దేశంలో ద్విజులు దళితులుగా మారే పరిస్థితిలేదు. శూద్రులు, వెనుకబడిన కులాలు, కొందరు దళితులు కూడా బ్రాహ్మణీయ భావజాలానికి ప్రభావితులై కొందరు చెప్పే 'సోషల్ ఇంజనీరింగ్' ద్వారా సామాజిక మార్పుకు గురయ్యారు. సమాజంలో యథాతథ స్థితి కోల్పోయి వేరే విధంగా మారడం కూడా సామాజిక మార్పే. తద్వారా దళితులకు జరిగే లాభం స్వల్పం అని కాన్షీరామ్ గ్రహించాడు. సామాజిక ఉద్యమాల కంటే రాజకీయ అధికారం చేపట్టడం సులభం, అవసరం. రాజకీయాల ద్వారా సామాజిక, ఆర్థిక రంగాలను

ప్రభావితం చేయవచ్చని, అవే మను+కౌటిల్యులు చెప్పే సూత్రాలని గ్రహించి, తన ప్రయోగాలకు యుపిని ఎంచుకున్నాడు. భారతదేశం అంతా ఒకేలా లేదని కాన్షీరామ్ ఆలస్యంగా గ్రహించివుంటారు.

అందుకే ఉపకుల మతాలవల్ల ముక్కలై నిద్రాణంలో వున్న దక్షిణ భారతదేశాన్ని విడిచిపెట్టి ఉత్తరప్రదేశ్‌లో కృషిచేసి ఫలితాలు అందించాడు. మాయావతిని తయారు చేశాడు. ఇక్కడే ఉత్తరప్రదేశ్ ప్రత్యేకతలను చూడాలి. దేశ రాజకీయాలను ప్రభావితం చేసే పరిస్థితులు యుపిలో ఉన్నాయి. వాటన్నింటి కంటే దళితుల రాజకీయాల్లో 1944 నుంచి 1984 వరకు బిఎస్‌పి ఏర్పడే వరకు ఏభై ఏళ్లపాటు వివిధ రాజకీయ ప్రయోగాలు జరిగాయి. ప్రధాన కులాలైన చమర్, పాసి, దోభి, కోరి, జాతవతో సహా 66 కులాలు రాష్ట్రంలో సుమారు 22 శాతం జనాభా కలిగి ఉన్నాయి. క్రైస్తవ మత ప్రభావం తక్కువ. ముస్లింలతో కలిస్తే కొన్ని జిల్లాల్లో 50శాతం కంటే ఎక్కువ జనాభా వుండడంతో కాన్షీరామ్ ప్రయోగం సులభమయింది. మొత్తం 63 జిల్లాల్లో దళితులు 22శాతం దాటిన జిల్లాలు 37, 30 శాతం కంటే ఎక్కువ దళితులున్న జిల్లాలు అయిదు వున్నాయి. ఈ పరిస్థితి ఆంధ్రాలోగాని, దక్షిణాదిలో ఒకటి రెండు జిల్లాలు మినహాయిస్తే ఎక్కడా లేదు. అందుకే కాన్షీరామ్ రాజకీయ ప్రయోగంలో సఫలమయ్యాడు. 1989లో 13 సీట్లు 10శాతం ఓట్లు వచ్చిన బిఎస్‌పి, 2002 నాటికి 98 సీట్లు, 24 శాతం ఓట్లు సాధించి అధికారంలో కొనసాగుతోంది. రాజకీయ అధికారంలో కొనసాగటం ప్రధానం కాదు. తాము చెప్పే రాజకీయ అధికారం ద్వారా సామాజిక, ఆర్థిక మార్పులకు చేసిందేమైనా ఉందా? అన్నది ప్రధానం. ఎందుకంటే సామాజిక మార్పుల్లో భాగమైన మహిళా రిజర్వేషన్ బిల్లు వంటివి మాయావతి తీసుకురాగలదా? అన్న ప్రశ్నకు సమాధానం వెతుక్కోవాలి కదా!

దేశంలో నేడు ముగ్గురు మహిళలు ముఖ్యమంత్రులుగా ఉన్నారు. ఈ ముగ్గురూ ద్విజేతరుల నాయకత్వంలో ఎదిగినవారే. జయలలిత అధికారంలోకి రాగానే తనెంత గొప్ప మనువాదో నిరూపించుకోటానికి మతమార్పిడుల బిల్లు, గుళ్లు గోపురాలు వంటివి చేపట్టారు. రబ్రీదేవి భర్తచాటు మనిషైనా తనకూ సొంత ఆలోచనలున్నాయని నిరూపించటానికి ప్రయత్నిస్తున్నారు. మాయావతి మూడవ దఫా అధికారంలోకి వచ్చాక ఉత్తరప్రదేశ్ చరిత్రలో గతంలోలేని విధంగా రూ. 12,575 కోట్లు పన్నుల రూపంలో వసూలు చేశారు. 45 జిల్లాల్లో మహిళా డెయిరీలు నెలకొల్పారు.

రెండు విశ్వవిద్యాలయాలు నెలకొల్పి, రిజర్వేషన్ వర్గాలకు సిండికేట్‌లో ప్రాతినిధ్యం ఇచ్చేలా చట్టం చేశారు. భూ సంవస్కరణలు చేపట్టారు. 89,000 మంది దళితులకు భూములు ఇచ్చారు. 28,000 మంది కౌలుదార్లకు శాశ్వత పట్టాలు ఇచ్చారు. రోడ్డుపక్క ఉండే రాళ్లకు, రప్పలకు తిండిపెట్టి వృథా చేయకుండా ఆ డబ్బు పార్టీకి యివ్వాలని దళితులకు హితబోధ చేశారు. మహిళలంటే ఎన్నలేని గౌరవమేకాదు మనుధర్మాన్ని కాలరాసే పూలే, పెరియార్, అంబేద్కర్, సాహు మహారాజ్ ఆలోచనలను ప్రచారం చేస్తున్నారు. మనువాదులతో ఆర్థిక లావాదేవీల కోసం రాజీపడే ఎన్‌డిఎ భాగస్వాములకంటే మనువాదులతో ఉంటూనే మానవధర్మాన్ని అవలంబిస్తున్న మాయావతి నిజంగానే మాతా హిడంబి వారసురాలు. మరాఠీలో వచ్చిన నేతన్ దాతార్ నాటకం మాతా హిడంబిలో కుంతి – హిడంబి సంవాదంలో ఒకరు పితృస్వామిక ఆర్య సాంప్రదాయానికి ప్రతీక, యింకొకరు మూలవాసి మాతృస్వామిక వ్యవస్థకు ప్రతినిధి. మాయావతి యీ దేశ మూలవాసి. తన పార్టీలో మహిళలకు తగు ప్రాతినిధ్యం కల్పించి మిగతా రాజకీయ పార్టీలకు మార్గదర్శకం కావాలని ఆశిద్దాం.



# ఒకే దేవుడు, ఒకే మతం, ఒకే నది కావాలా?

నీటి పారుదల ప్రాజెక్టులు వ్యవసాయరంగానికి చెందినవి మాత్రమే అనుకుంటే పొరపాటు. వాటి వెనుక ఆర్థిక, రాజకీయ అంశాలతోబాటు సామాజికాంశాలుకూడా వున్నాయి. అందుకే దక్షిణాది నదులు సంధానం కోసం సుబ్రమణ్యస్వామి పాదయాత్ర మొదలు పెట్టినప్పుడు అప్పటి ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు డా. శివరామకృష్ణయ్య ఇది స్వామి మాయాజాలం, దక్షిణాది నదుల్లో మిగులేది, ఆంధ్రులకు దీని ద్వారా అన్యాయం జరగబోతోందని హెచ్చరించారు. భారతదేశం, చైనా వంటి చాలా ఆసియా దేశాల్లో వుండే వైవిధ్యభరితమైన సామాజిక వ్యవస్థ, సామాజిక కట్టుబాట్లు యీ ప్రాంత నీటివనరుల వినియోగం కోసం ఏర్పడిన వ్యవస్థలవల్ల వచ్చాయన్నది చారిత్రక సత్యం. అందుచేత నీటిపారుదల ప్రాజెక్టులు, లేక నదుల సంధానం గూర్చి సాంకేతిక నిపుణులు ఏమి చెప్పినా, దాని సామాజిక ప్రభావం గూర్చి చర్చించకపోతే ఆ నీరు వచ్చి సామాన్యులకు చేసే మేలేముంటుంది?

ఇటీవల నదుల సంధానం గూర్చి చర్చ ప్రారంభమయింది. వివిధ దేశాల్లో నదుల సంధానం ఎలా జరిగింది, తద్వారా అదనంగా ఎంత నీరు వచ్చింది, ఎంత వ్యవసాయ భూమి సాగుబడిలోకి వచ్చింది అన్నవి చర్చనీయాంశాలయ్యాయిగాని, ఏ పరిస్థితుల్లో అది సాధ్యమయింది, వాటివల్ల సమాజంలో తారతమ్యాలు తగ్గాయా, పెరిగాయా, మానవాభివృద్ధి ఎంతవరకు సాధ్యమయింది? అన్న విషయాలను చర్చించటం లేదు. భారతదేశంలో నదుల అనుసంధానం గూర్చి బ్రిటిష్ కాలంలోనే ఆలోచన ప్రారంభమయింది. అయితే అది వ్యాపార దృష్టితో మొదలయింది. కాటన్ దక్షిణాది నదులపై ఆనకట్టలు నిర్మిస్తున్న కాలంలోనే కలకత్తా నగరాన్ని అటు కంచితోను, యిటు మద్రాసుతోను అనుసంధానం చేసే నేవిగేషన్ కెనాల్ కోసం ప్రయత్నం చేశారు. అప్పుడు దేశ రాజధాని కలకత్తా కాబట్టి చవకైన రవాణా కోసం ఈ మార్గాన్ని అన్వేషించి ఆర్థికంగా అది సాధ్యపడదని విడిచిపెట్టేశారు. రవాణా మార్గాన్ని దృష్టిలో

వుంచుకునే ఇప్పుడు చెబుతున్న నదుల సంధానం గూర్చి కాటన్ అప్పుడే మాట్లాడారు. దాన్నే డా. కె.యల్. రావు పునరుద్ఘాటించారు. అయితే బ్రిటీష్ కాలంలో నీటి రవాణా గూర్చి మాట్లడేటప్పుడు నాటి మార్గాలు ఎటువంటి స్థితిలో వున్నాయో, దేశం మొత్తం మీద లక్షకు మించని వాహనాలు, నాటి పరిస్థితులు అర్థం చేసుకోవాలి. నేడు ఆ పరిస్థితులు లేవు. అయితే డా. కె.యల్. రావు దేశంలో మిగులు జలాలు వున్న ప్రాంతాల నుండి దుర్భిక్ష ప్రాంతాలకు నీరందివ్వాలనే ఆలోచనతోనే నదుల సంధానం - ముఖ్యంగా గంగా కావేరి అనుసంధానం చర్చకు తెచ్చారు. నీటి వనరులు తక్కువగా వున్న తమిళనాడుకు యిది వరంలా తోచింది. అందుకే దీనికి ఎనలేని ప్రచారాన్ని యిచ్చారు. నదుల అనుసంధానమే జరిగితే పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలకు రాబోయే ప్రమాదం గూర్చి డాక్టర్ శివరామ కృష్ణయ్య హెచ్చరిస్తూనే వున్నారు. గోదావరి జలాల్లో ఆంధ్రులకు న్యాయబద్ధంగా వచ్చే వాటాలో 250 టిఎంసిలు తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలకు బదిలీ చేయాలనే ఆలోచన అప్పటి ఎన్‌డబ్ల్యుడిఎ డైరెక్టర్ జనరల్ ఎ.డి. మొహిలికి ఉండేదని తెలిసింది. పైగా మహానది గోదావరి అనుసంధానం గూర్చి ప్రముఖంగా ఎవరూ మాట్లాడటమే లేదు. ఉత్తరాంధ్ర జిల్లాలోని నదుల్లో వున్న మిగులు జలాలను ఉపయోగించేందుకు కనీస కార్యక్రమం కూడా లేదు. అటువంటప్పుడు ఈ అనుసంధానంవల్ల ఆంధ్రప్రదేశ్‌కు వచ్చే లాభనష్టాలేమిటో చర్చించవలసిన అవసరం వుంది.

కేంద్ర ప్రభుత్వం 1980లో నీటి వనరులకు సంబంధించి ఒక బృహత్తర ప్రణాళిక రూపొందించింది. ఇటీవల రిటైర్డ్ ఇంజనీరు ఆర్.కె. మూర్తి గంగా-కావేరి అనుసంధానం గూర్చి ఇందిరాగాంధీ హయాంలో చర్చించి, దానివల్ల వచ్చే పర్యవసానాలు, ముఖ్యంగా పర్యావరణ వ్యతిరేకతలను దృష్టిలో వుంచుకుని ఆ ప్రాజెక్టును పూర్తిగా విస్మరించటం జరిగిందన్నారు. అయితే 1982లో నేషనల్ వాటర్ డవలప్‌మెంట్ ఏజెన్సీ ఏర్పడిన తరువాత అనేక పరిశోధనలు జరుగుతూ వస్తున్నాయి. ఇప్పటికి సుమారు 72 అనుసంధానాల గూర్చి వీరు ఆలోచించారు. హిమాలయ ప్రాంతానికి 21 లింకులు, హిమాలయం - భారత ఉపఖండాన్ని కలిపే లింకులు 16, హిమాలయ నదుల సంధానం లింకులు 14, ఈ నదుల నీటిని తరలించే ప్రధానమైన లింకులు 21. మొత్తం 72. అయితే ఇందులో ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన 5 ప్రధాన సంధానాలు వున్నాయి. వీటివల్ల రాష్ట్రానికి ఎటువంటి లాభం చేకూరుతుందో సాంకేతిక నిపుణులు, మేధావులు చర్చించాలి. నదులు

సంధానానికి అయ్యే ఖర్చు అంచనా వేయకపోయినా 1972 నాటికి కె.ఎల్.రావు గంగా-కావేరి సంధానానికి రూ. 12,500 కోట్లు, అదే 1995 నాటి ధరలలో రూ. 70,000 కోట్లు అన్నారు. ఇటీవల కేంద్ర ప్రభుత్వం డిసెంబర్ 2002న ప్రకటించిన లెక్కల ప్రకారం రూ. 5.60 లక్షల కోట్లు ఖర్చవుతుంది. కేంద్ర జలవనరుల మంత్రిత్వశాఖ షెడ్యూల్ ప్రకారం ఈ సంధానం 2016లో ప్రారంభమై పదేళ్లలో పూర్తవుతుంది. అంటే ఈ అనుసంధానం నాటి పరిస్థితులు, వ్యయం ఏవిధంగా వుంటాయో అర్థం చేసుకోవచ్చు.

మెగా ప్రాజెక్టుల నిర్మాణంవల్ల వ్యవసాయం అభివృద్ధి చెంది దేశంలో పేదరికం, కరువు మాయమైపోతే సంతోషించని వారెవరూ వుండరు. కాని ఇప్పుడు అమలులోవున్న నీటిపారుదల ప్రాజెక్టుల వల్ల ఇదిసాధ్యం కాదా! పంజాబ్, హర్యానా, కోస్తా ఆంధ్ర వంటి ప్రాంతాల్లో వచ్చిన సామాజిక, రాజకీయ మార్పులను ఎలా స్వీకరించాలి అన్నది యిప్పుడు ముఖ్యం. దేశంలో కొన్ని ప్రాంతాల్లో కరువుకు అక్కడి పంటలకు సంబంధం లేదు. ఉదాహరణకు కలహండి జిల్లాలో కరువు అక్కడ పంటలు లేకకాదు. ఒరిస్సా రాష్ట్రంలో అన్ని జిల్లాల కంటే కలహండిలో వరి ఎక్కువగా పండుతోంది. మరి కరువు ఎందుకు వచ్చింది? కరువును చూపి నదుల అనుసంధానం కోరనక్కరలేదు. ఈ దేశ చరిత్రను చూస్తే కరువును అధిగమించడానికి నాటి చిన్నచిన్న రాజ్యాలు, ప్రజాతంత్ర వ్యవస్థలు ఎటువంటి మార్గాలను ఎంచుకున్నాయి, ఏ విధంగా వారు స్థానిక వనరులను ఉపయోగించుకున్నారు, చెరువులు, కాలువలు, నూతులతోబాటు పంటల రకాలను ఏ విధంగా మార్చుకుని పర్యావరణ సమతుల్యం దెబ్బతినకుండా ప్రజలను రక్షించుకున్నారో ఆలోచించాలి. దేశంలో సుమారు 7 రకాల అగ్రో-క్లైమేటిక్ జోన్స్ వున్నాయి. ఈ ప్రాంతాల్లో అక్కడి వనరులు, నీటి వనరులపై ఆధారపడి సామాజిక, జీవన నిర్మాణం జరిగింది. గంగా పరీవాహక ప్రాంత జీవనానికి, దక్షిణ పీఠభూమి ప్రాంతానికి, ఆంధ్రలో కళింగసీమ, రాయలసీమ, ఉత్తర తెలంగాణ, దక్షిణ తెలంగాణా, కోస్తా ప్రాంత ప్రజల జీవన శైలిలో వైవిధ్యానికి అక్కడి నీటి వనరులు ప్రధాన కారణం. ఇటీవల పర్యావరణ శాస్త్రవేత్తలు చెబుతున్నట్లు ఒక్కొక్క నదిలో ఒక్కొక్క విధమైన నీటి Propreties వుంటాయి. ఆ నీటి మీద ఆధారపడే వైవిధ్యభరితమైన జీవ సంపద వుంటుంది. జమ్ము - కాశ్మీర్‌లో ఉండే జీవవైవిధ్యం రాయలసీమలో వుండదు. హిమాలయాల్లో లేక ఆ నదుల్లో వుండే వైవిధ్యం నర్మద, మహానది గోదావరి నదుల్లో వుండదు. అదే ఈ దేశ సంపద. అదే ఈ దేశ ఔన్నత్యాని!

వైవిధ్యభరితమైన సజీవ జీవ వైచిత్రికి కారణం. దాన్ని కూడా చూసి ఓర్వలేకపోతే చేసేదేముంది? ఇంతకాలం లేని సందానం యిప్పుడెందుకొచ్చింది? ఒకే దేవుడు, ఒకే మతం, ఒకే నది కావాలా? ఇది దేన్ని సూచిస్తోంది? వనరులన్నీ కేంద్రీకృతమై, ప్రజాస్వామ్య వ్యవస్థలు ఛిద్రమైపోతే అప్పుడు ఒకే జాతి, ఒకే నాయకుడు ఒకే పాలన రావాలనే ఫాసిస్టు ఉన్మాదులు దేశాన్ని సర్వనాశనం చేసే అవకాశాలుంటాయి. భారతదేశం అమెరికా కాదు, చైనా కూడా కాదు.

భారతదేశంలో ఇప్పుడున్న పరిస్థితుల్లో మెగా ప్రాజెక్టుల నిర్మాణం సామాజిక గందరగోళానికి దారితీసే సూచనలున్నాయి. నీటిని చౌకగా సరఫరా చేయటంతో నీటిని ఎక్కువగా పీల్చుకుని వరి, చెరుకు పంటలు పండించి, నవధాన్యాలను మన రైతులు విస్మరించేలా చేశారు. ప్రజలకు ఆహార భద్రత కల్పిస్తున్నామని నీటి భద్రత విస్మరించారు. సాగునీటికంటే కూడా తాగునీటికి కటకటలాడే జనాభా ఎంతో ఈ దేశంలో వున్నది. ఇటీవల సాంకేతిక నిపుణులు, పర్యావరణ శాస్త్రవేత్తలు చెబుతున్న ప్రత్యామ్నాయ నీటి వనరుల సంచయం, మధ్యతరహా నీటిప్రాజెక్టులు, ముఖ్యంగా రాష్ట్ర పరిధిలో వుండే చిన్న నదుల సంధానంపట్ల కొంత శ్రద్ధ వహించాలి. గంగానదిని అడ్డుకోకూడదని, హిందువుల నమ్మకంతో ఆట్లాడుకోవద్దని బ్రిటీష్‌వారిని బెదిరించిన దేశం మనది. అదే గంగానదిని యిప్పుడు బీహార్‌లోని పాట్నావద్ద 2000 అడుగుల ఎత్తు నుంచి 3000 అడుగుల ఎత్తున వుండే కలహండి జిల్లాకు నీరిచ్చి కరవును నివారించొచ్చు అంటున్నారు. సాంకేతికంగా సాధ్యమయినా, కాకపోయినా, బీహార్ రాష్ట్రం యిప్పుడు పారిశ్రామికంగా వెనుకబడి ఉంది. పట్టణీకరణ జరగలేదు. భవిష్యత్‌లో గంగానది పరివాహక ప్రాంత ప్రజల సగటు నీటి వినియోగం, మిగతా ప్రాంతాలతో పోలిస్తే తక్కువ ఉంటుంది. అప్పుడు గంగలో నీరుకాదు, రక్తం ప్రవహిస్తుంది. చరిత్రలో బుద్ధుని దగ్గరనుండి నీటి కోసమే యుద్ధాలు జరిగాయి. ఇప్పుడు డాలర్లకోసం, రూపాయలకోసం మెగా ప్రాజెక్టులు వస్తున్నాయి. చిన్నదా, పెద్దదా కాదు ముఖ్యం, ప్రజలకు నీరు కావాలి. ఆ నీరిచ్చే మార్గాలనేకం వున్నాయి. అయినా ప్రైవేటీకరణను మతంలా ప్రచారంచేసే ఈ రోజుల్లో ప్రభుత్వాలకు ఎందుకింత శ్రమ? అందులో ప్రపంచీకరణ ప్రాపంచిక దృక్పథంగా భావించే మేధావులు భవిష్యత్‌లో అర్కిటిక్-గ్రీన్ లేండ్స్-హిమాలయాలను కలపకపోతారా! ప్రపంచ నీటి కొరత తీర్చకపోతారా! ప్రపంచంలోని నీరంతా ఈ మూడు చోట్లే వుంది.



# రచయిత గురించి

తెలుగు పాఠకులకు ఆచార్య కె.యస్. చలం చిరపరిచితులు. శ్రీకాకుళంజిల్లా పాతపట్నం గ్రామంలో పుట్టిన చలం అదే వూళ్ళో హైస్కూల్ విద్యనభ్యసించారు. తరువాత యస్. కె. సి. జి. కాలేజి, పర్లాకిమిడిలో బి.ఎ. ఆనర్స్‌లో అర్థికశాస్త్రం, చరిత్ర అభ్యసించారు. ఎమ్.ఎ. అర్థికశాస్త్రం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చదివి అక్కడి నుండి పి.హెచ్.డి. పొందారు.

అదే శాఖలో ప్రస్తుతం ప్రొఫెసర్ గా ఎదిగి అంధ్ర విశ్వవిద్యాలయం ఎకడమిక్ స్టాఫ్‌కళాశాల డైరెక్టర్‌గా పనిచేస్తున్నారు.

పోలెండ్‌లో ప్లేనింగ్‌లో డిప్లొమా చేసిన చలం 15 దేశాలను విద్యావిషయికంగా సందర్శించారు. ఇప్పటికి తెలుగులో 6, ఇంగ్లీషులో 16 పుస్తకాలను ప్రచురించారు. 75కు పైగా పరిశోధకవ్యాసాలు అంతర్జాతీయస్థాయి జర్నల్స్ ప్రచురించారు. వందలసంఖ్యలో ఎడిట్ పేజివ్యాసాలు తెలుగులో అన్నిదినపత్రికల్లో ప్రచురించారు. ఈయన పర్యవేక్షణలో డజనుమంది పరిశోధకులు పి.హెచ్‌డీ. ఎమ్. ఫిల్‌లు పొందారు.

1984లో మొట్టమొదటిసారి యుజిసివారి యంగ్ సోషల్ సైంటిస్ట్ అవార్డు పొందారు. అమెరికా బయోగ్రాఫికల్ సొసైటీ వారి మాన్ ఆఫ్ ది యియర్, విజయశ్రీ, కళింగసీమ అవార్డు, టీచర్ విత్ సోషల్‌కాన్షన్‌నెస్ వంటి సత్కారాలు పొందారు. చంద్రంగారి స్మారకోపన్యాసంతోబాటు ఎన్నో స్మారకోపన్యాసాలు దేశవ్యాప్తంగా యిచ్చారు. దేశంలోను, రాష్ట్రంలోను అన్ని సమకాలీన ఉద్యమాలతో సంబంధం కలిగివున్నారు అఖిల భారత శాంతిసంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులుగా ఉన్నారు. ఏ.పి.టి.యఫ్ జిల్లాఅధ్యక్షులుగా విశాఖ రచయితల సంఘం కార్యదర్శిగా, ఆమ్నెస్టీయింటర్‌నేషనల్ జాతీయ కార్యదర్శిగా, పొలిటికల్ ఎకానమి కార్యదర్శిగా ఐఐపిఎ విశాఖ అధ్యక్షులుగా వున్నారు.